# పాత్రలు

| | | |
|---|---|---|
| శ్రీకృష్ణుడు | ... | నాయకుడు |
| విదురుడు | ... | ధృతరాష్ట్రుని మంత్రి |
| భీష్ముడు | ... | కౌరవ పితామహుడు |
| ద్రోణుడు | ... | అస్త్రగురువు |
| కర్ణుడు | ... | (అంగరాజు) - ప్రతినాయకుడు |
| దుర్యోధనుడు<br>దుశ్శాసనుడు | ... | కౌరవ ముఖ్యులు |
| ఏకలవ్యుడు | ... | శబరరాజు |
| వృషసేనుడు | ... | కర్ణుని కుమారుడు |
| యుయుత్సుడు | ... | ధృతరాష్ట్రుని కుమారులలో నొకడు |
| కుంతి | ... | పాండవ మాత |
| అర్జునుడు | ... | పాండవ మధ్యముడు |
| ద్రౌపది | ... | పాండవ పత్ని |
| దారుకుడు | ... | శ్రీకృష్ణుని సారథి |
| జాంగలుడు | ... | గూఢచారుడు |
| ప్రతీహారి | ... | |
| సేవకులు | ... | |

# ధర్మరక్షణము

## పరిచయము

అన్యాయాధర్మములు ప్రబలి సంఘము పాపభూయి
ష్ఠమైయున్న సందర్భములలో భగవంతు డవతరించి పాప
మును నశింపజేసి లోకులను మరల సత్యధర్మముల కనుస్మ
ఘులుగ నొనర్చునని గీతావాక్యము. అదియే ధర్మ సంస్థా
పనము. రామాద్యవతారములన్నియు నీ వాక్యార్థముతో
సమన్వితములై యున్నవి. అట్టి యవతారములలో శ్రీ కృష్ణా
వతారము విశిష్టమైనది. మత్స్య కూర్మ వరాహ నారసింహ
వామనావతారములందలి ప్రయోజనము పరిమితము, నొక
విధముగ, నేకదేశము. వానియందు భగవంతుని యంశము
ప్రత్యక్ష గోచరమైయున్నది. పరశురామ, రామావతారము
లలో దివ్యత్వము నిగూఢము, ప్రచ్ఛన్నము. మానవత్వ
మున ప్రవర్తిల్లుచు సద్ధర్మదీక్షచే పురుషోత్తమత్వము నాద
ర్శము కావించి రాముడు లోకమునకు ధర్మస్వరూపమును
ప్రదర్శించినాడు. శ్రీరాముడు కావించిన సమగ్రధర్మనిర్వ
హణములో రావణ సంహారమొక యంశముమాత్రమే.
శ్రీరామావతారము నందాదినుండియు తుదివరకును మనకు
ప్రత్యక్షముగ గోచరించునది స్వధర్మ నిష్ఠాపరమైన మానవ
త్వమే. శ్రీ కృష్ణావతారమున దివ్యత్వ మానవత్వములు
రెండును ఆదినుండి తుదివరకును నెడనెడ భాసించుచునే

యున్నవి. శ్రీకృష్ణు డవతరించునాటికే లోకము అన్యాయా
క్రాంతమైనది. ధర్మమునకు భంగము వాటిల్లినది. న్యాయ
మును, సత్యమును రక్షింపవలసిన రాజులే ఇంద్రియములకు
వశులై స్వార్థపరులై ధర్మచ్యుతికి కారకులైనారు. లోకా
తీతములగు సత్యధర్మములకు రక్షకులై నిలువవలసిన బ్రాహ్మ
ణులందుకూడ స్వధర్మ విముఖులగుట జరిగినది. దీనినిబట్టియే,
ద్వాపరయుగమున ధర్మము రెండు పాదములతో మాత్రమే
నడచుచున్నదని [illegible] పేర్కొనినది. రామావతారమునందు
వలె కేవలము విశిష్ట మానవశక్తిచే లోకసంస్కారము జరు
గుట కిప్పు డవకాశము లేదు. అసంఖ్యాకముగ ప్రబలి సంఘము
నాక్రమించుకొనియున్న పాపులను నిర్మూలించి, సంఘమును మరల
ధర్మోన్ముఖ మొనర్చుట శ్రీకృష్ణావతార ప్రయోజనము.
ఇందులకై శ్రీకృష్ణుడు బాల్యమునందే నానా సందర్భము
లలో దివ్యత్వమును వ్యక్తావ్యక్తముగ ప్రదర్శించుచు, దుష్ట
శిక్షక శిష్టరక్షకుడగు భగవంతుని శక్తిని ప్రజలు గ్రహించున
ట్లొనర్చినాడు. యమళార్జున భంజనము, గోవర్ధనోద్ధరణము,
కాళీయమర్దనము, దావాగ్నిపానము మున్నగు శ్రీకృష్ణుని
దివ్యక్రీడలన్నియు నీ ప్రయోజనముతో ననుసంధించుచున్నవి.
కంస శిశుపాల జరాసంధాదుల విషయికమగు వ్యక్తిగత
వైరము వారివధకు నిమిత్తమాత్రమైనది. వారి సంహారముచే
శ్రీకృష్ణు డుద్దేశించినది పాపనిర్మూలనమే. బలవంతులు
నధర్మప్రవర్తకులు లోకద్రోహులునగు నరకాసురాదుల
సంహారముకూడ నిట్లే ధర్మరక్షణమున కావశ్యకమైనది.
ధార్తరాష్ట్రుల అన్యాయ ప్రవృత్తి మూలకమగు భారత

సంగ్రామము పాపనిర్మూలనమునకు ప్రధాన సాధనముగ
శ్రీకృష్ణున కుపకరించినది. తనయొక్కయు తనవారి
యొక్కయు దుష్ప్రవృత్తి మూలకమగు ఫలమునకు తాను
తనతోడివారును మాత్రమే కాక నిర్దోషులగు ఇతరులుగూడ
భోక్తలగుట తప్పదనెడు భావము కలిగినప్పుడే లోకమున
జ్ఞానోదయమున కవకాశ మేర్పడగలదు. దాని ననుసరించియే
భారతయుద్ధమున దోషులు నిర్దోషులు అను విచక్షణలేక యెల్ల
రును నశింపవలసివచ్చినది. యుద్ధమున [illegible] గాంధారీ
ధృతరాష్ట్రాదులు, కౌరవస్త్రీలు. పాండవపక్షమందలి ఉత్తరా.
ద్రౌపదీ సుభద్రాదులు, దేవకీ కుంతీ. ఇట్టి వారలు దోషము
లేక యెల్లరును నధర్మ పరిణామఫలము ననుభవించినవారే.
ఇతర పరిణామహేతువగు కార్యమునకు కర్త యెవ్వడైనను
తత్ఫలమును వాడు మాత్రమే కాక ఇతరులును అనుభవింపక
తప్పదు. గృహదాహమునకు కారకు డొక్కడే కావచ్చును.
కాని తద్గృహమందలి యితరులును. శిశుస్త్రీ సహితముగ
తత్పరిసరములందలి వారును శిక్షితులగుదురుగదా. ఇది
ప్రకృతి తత్త్వము. "ఏకో హి కురుతే పాపం ఫలం భుంక్తే మహా
జనః" అనువాక్య మీ సత్యమునే యుద్ఘోషించుచున్నది.
మానవబుద్ధి కతీతమగునట్టి భగవత్తత్త్వమునకు భగవల్లీల
లకు నమోవాక మొనర్చి సత్యధర్మముల నాశ్రయించి
న్యాయపథమున జీవించుటయే విశిష్ట సౌఖ్యహేతువు. పరమో
పాయము నని లోకమునకు ప్రత్యక్షముగ వ్యక్తము గావిం
చుట శ్రీకృష్ణుని ప్రధానోద్దేశము. శ్రీ కృష్ణావతారమున
నిర్వహింపబడిన ప్రతి విషయమును నీ ప్రయోజనముతో

సమున్నయించుచున్నది. ఈ రూపకమున పోషితమైన యేక లవ్య సంహారేతివృత్తమును నట్టిదే. అహంభావము, మాత్స ర్యము, రోషము నను దుష్ప్రవృత్తులకులోనై, అర్జున నిగ్రహా పరాయణ స్వార్థగతమగు స్వప్రయోజనము నాశించి ధర్మ విద్రోహాల పక్షము నవలంబించిన యేకలవ్య నిషాదునొక సృష్టికంటకము నటె శ్రీకృష్ణుడు నలిపివైచుట ఇందలి ప్రధా నేతివృత్తము.

మహాభారతాంతర్గతమగు ద్రోణపర్వమందలి యొక సూచన యీ యితివృత్తమున కాధారము. కర్ణప్రయుక్త మైన శక్తిచే ఘటోత్కచుడు పడిన సందర్భమున శ్రీకృష్ణుడు తన సంతోషము నిట్లు ప్రత్యక్షముగ వ్యక్తముచేసి యున్నాడు.

"అట్లు మృతుండైన హిడింబాసుతుంజూచి కౌంతేయు లత్యంత దీనమానసులై కన్నీరుగడలుకొన నడలుచుండిరి. గోవిందుండు ప్రమోదంబునొంది సింహనాదంబుసేసి శంఖంబు పూరించి పగ్గంబులు నొగలముడిచి, మందమారుతాందోళితం బగు మందారంబు చందంబుతోప నర్తించుచు నరదంబునడి కరిగి, కిరీటిం గౌగిలించి వాని వీపప్పళించి వెండియు నార్చిన..."

ఇట్టి విపరీత ప్రవర్తనమునకు కారణమేమని యర్జును డడుగ "నయ్యచ్యుతుం డతని కిట్లను. ఇంద్రుండు కుండలంబులు గొనుచుండి కర్ణునికిచ్చిన శక్తి యతనికడ నున్నంతకాలం బును నిన్ను బ్రదికించుట దుష్కరంబని తలంచుచుందుదు.

నేఁడు హిడింబానందనుమీఁద నదివోయినం బ్రమోదంబు నొందితిని. ఆ సూతనందనుండది సేతనుండెనేని చక్రగాండీవధరులమై మన మిరువురముం గదిసితిమేనియు జయించు. అతండు కవచకుండల విహీనుండై మానవ సామాన్యంబు నొందుటను, శక్రదత్త సాధనంబు లేమింజేసియు నింక నీకు గెలువవచ్చును. ఇట్లు యేకలవ్య శిశుపాల జరాసంధాదుల నేకకానొక్కొక్క. తెరంగునం బిలుకు మార్చితిని. క్షత్రజి వారలున్నఁ గౌరవపతి వారలం దెచ్చికొను...... ఘటోత్కచుండును గిమ్మీర బక హిడింబుల తోడివాఁడు. ధర్మద్వేషంబును కోపంబును గలిమింజేసి యొకప్పుడొప్పుమి వచ్చుం గావున నద్దానవుల యట్ల వీని పొలిసిపోకయు నాకభిమతంబు. వీఁడు రావణు నట్టివాఁడగుట నిపుడు నావకుండెనేనిఁ బదంపడి నాకుం జంపవలయును. ఇది సంతోషకాలంబుకాని శోకసమయంబుకాదు.''

ధర్మద్వేషులగువారిని పాపులను నశింపజేయుటయు, సత్యవర్తనులగు సజ్జనాదులను రక్షించి లోకమున ధర్మమును ప్రతిష్ఠించుటయు, శ్రీకృష్ణుని యాశయములనుట ఈ పలుకులవలన వ్యక్తమగుచున్నది. అధర్మపరులైనవారిని శిక్షించుటలో శ్రీకృష్ణుడు స్వపరభేదమున కతీతుడనికూడ దీనివలన తెల్లమగుచున్నది. "ధర్మవిద్వేషులు, ధర్మవిప్లావకులునగు పాపాత్ముల నెల్లను మడియించుట, అద్దేవదేవు దివ్యలీల''లని హరివంశము వివరించుచున్నది. ఇంద్రదత్తమగు శక్తిని ప్రయోగించి కృష్ణార్జునులలో నొకరిని సంహరింపవలె

నని ప్రతిదినమును యుద్ధాంతమున కర్ణుడు కృతనిశ్చయు డయ్యెను మఱునాడు యుద్ధమారంభమగు నప్పటికి కృష్ణుని మాయాప్రయోగముచే నా విషయమును పూర్తిగ విస్మరించుచుండెడివాడు. ఆశక్తికి ఘటోత్కచునిపై ప్రయుక్తమగుటవలన నర్జున రక్షణమును రాక్షసాంశసంజాతుడగు ఘటోత్కచుని సంహారమును ననెడు ఇష్టప్రయోజనములు సిద్ధించినవి. పాపులు, లోకకంటకులునగువారి సంహార విషయమున శ్రీకృష్ణు డవలంబించు విధానములును, నసాధారణములై నవనుటకు కంస జరాసంధ శిశుపాలాదుల సంహారములు ప్రామాణ్యములు.

శ్రీకృష్ణుడిట్లు న్యాయధర్మ ప్రతిష్ఠాపనకై కావించిన దుష్టసంహారములలో నేకలవ్య సంహారమొకటి. కాని యెప్పు డేవిధమున నేకలవ్య సంహారము జరిగినదో తెలియుటకు తగిన యాధారములు లేవు. ఏకలవ్య పౌండ్రక వాసుదేవులు ద్వారకపై దండెత్తి యుద్ధ మొనర్చినట్లును, పౌండ్రక వాసుదేవుడు కృష్ణునిచే సంహరింపబడినట్లును హరివంశమున గలదు. కాని యేకలవ్యుడు హతుడైనట్లు అందును లేదు. మరియు, పౌండ్రక వాసుదేవ సఖుడైన యీ యేకలవ్య నిషాదుడును ద్రోణునకు దక్షిణాంగుష్ఠము నర్పించిన యేకలవ్య శబరుడును నొకరగు దురో కాదో చెప్పుటకును నాధారము లేదు. ద్రోణుని పరోక్ష శిష్యుడైన యేకలవ్యుని యుత్తరోదంత మెట్టిదో తెలియదు. అయినను ద్రోణపర్వగతమగు శ్రీకృష్ణుని వాక్యమునుబట్టి యతనిచే నీ యేకలవ్యుడు నిహతుడైన ట్లూహిం

చుట తప్పుగాదు. అర్జునుడు కారణముగ తన దక్షిణాంగుష్ఠ మును గోలుపోయిన యేకలవ్యు డర్జునునియందు క్రోధమాత్స ర్యములు వహించుటయు ప్రకృతి సహజమైన విషయమే. మట్టిబొమ్మను గురుస్థానమున నిడికొని, బాలుడయ్యును ఆత్మ విశ్వాసమే యాధారముగ ధనుర్విద్యను సాధించి అర్జునాదుల నధిగమించిన యేకలవ్యుడు, దక్షిణాంగుష్ఠ రహితుడయ్యును నితోధికమగు దీక్షతో దక్షిణేతర కరమున విలువిద్యను సాధించియుండుటయు వింతకాదు. అర్జునుడు రెండు చేతుల తోడను అస్త్రప్రయోగమును సాధించి సవ్యసాచియని ప్రసిద్ధిగాంచియున్నాడు. ఆ విధముననే ఏకలవ్యుడును నస్త్ర విద్యా విశారదుడై అర్జునుని నిగ్రహించు నవకాశమునకై వేచియుండ శ్రీకృష్ణు డతనిని వధించియుండవచ్చును. ఏక లవ్య శిశుపాల జరాసంధాదులు బ్రతికియుండినచో దుర్యో ధనుడు వారిని తనకు బాసటగా తెచ్చికొని యుండెడి వాడనియు, కావున పాండవులకుగా తాను వారిని సంహరింప వలసి వచ్చెననియు శ్రీకృష్ణుడే వాక్రుచ్చియున్నాడు. అట్లు ధర్మరక్షణార్థమై శ్రీకృష్ణుడు కావించిన యేకలవ్య సంహార మీరూపకమున ప్రధానేతి వృత్తముగ కల్పితమైనది. ఈ విధ మగు నేకలవ్య సంహారమును మొదట నూహించినవారు కీర్తిశేషులు టి. పి. కైలాసంగారు. ఏకపాత్ర ప్రయోగార్హ మగు విధమున నీ యితివృత్తమును రెండు రంగముల యేకాం కికగ నాంగ్లమున రచించి దానిని కళాశాలలలో నందందు వారు స్వయముగ ప్రదర్శించుచుండిరి. తమకు సహాయుడుగ నేకలవ్యుని దెచ్చుకొనుటకై కర్ణ దుర్యోధనాదులు నిశ్చ

యించుట మొదటి రంగమునందును, తద్వృత్తాంతము నెరిగిన శ్రీకృష్ణుడు అరణ్యమునం దేకలవ్యుని కలిసికొని అతనిని వధించుట రెండవరంగమునందును ఇతివృత్తభాగములుగ వారి రచనలో పోషితములు.

[నేను తద్రూపక ప్రయోగమును చూచిననాటి కింకను అది ప్రచురింపబడియుండలేదు. 'ఏకలవ్య' అను పేరున దానిని వారు ప్రచురించిరని (ఆంగ్లముననో లేక కన్నడముననో?) వినియున్నాను కాని దానిని చూచు నవ కాశము నాకు కలుగలేదు.]

వారు ప్రతిపాదించిన యేకలవ్య సంహారమును మాత్రమే ప్రధానాంశముగ గైకొని, పూర్వాపరములగు భారత కథాంశములు దానితో సమన్వయించునట్లును, శ్రీకృష్ణుని జీవితలక్ష్యము సువ్యక్తమగునట్లును సన్నివేశము లను గూర్చుకొని, నేనీ రూపకరచన గావించితిని.

ప్రధానేతి వృత్తపోషణ కనుకూలించుచు తత్కథతో ననుసంధించుచున్న వివిధాంశములన్నియు భారతము నుండియే గ్రహింపబడినవి. ఆయా పాత్రముల శీలస్వభావా దులును భారతము ననుసరించియే పోషితములైనవి. ధర్మజుని చేరవచ్చుచున్న శల్యుడు మార్గమధ్యమున దుర్యోధ నాదులచే వంచితుడై తత్పక్ష మవలంబించినది, – భారతము ననుసరించి, – శ్రీకృష్ణుని రాయబారమునకు పూర్వము. అది సంధి ప్రయత్నమునకు తరువాత జరిగినట్లుగా నేను మార్చియున్నాను. నేను గావించిన మార్పిది యొకటియే.

స్వల్పమగు ఈ మార్పువలన భారతేతివృత్తమునకుఁగాని కావ్యప్రయోజనమునకుఁగాని యేమాత్రమును భంగము కలుగలేదని సహృదయులు గుర్తింపగలరు. ఇక భారతస్థము లగు సంశములు ప్రధానేతివృత్తముతో నెట్లనుసంధించుచు తత్పోషణ కుపకరించినవో వివరింతును.

శ్రీకృష్ణుడు లోకహితము నుద్దేశించి యొనర్చిన సంధి ప్రయత్నము కౌరవు లాపేక్షింపక ఔద్ధత్యమును ప్రవర్తించుట కురుసభలో జరిగిన విషయము. తదనంతర వృత్తాంతముతో కథ యారంభమగుచున్నది.

ప్రథమాంకము : హస్తినాపురినుండి మరలిపోవుచున్న శ్రీకృష్ణుడు విదురునితోడను భీష్మ ద్రోణులతోడను సంభాషించుచు యుద్ధ పర్యవసానమును వ్యక్తమొనర్చుటయు, తన్మహానర్థమునకు కౌరవులు మాత్రమే కాక వారి కాలంబముగనున్న భీష్మ ద్రోణాదులుకూడ బాధ్యులని నిరూపించి వారిని ధర్మోన్ముఖుల గావింప ప్రయత్నించుటయు, ఈ ఘట్టమందలి ప్రధాన విషయము. సమర్థులగు భీష్మ ద్రోణులు యుద్ధమునకు విముఖులై తటస్థులుగ నున్నచో ధృతరాష్ట్రుడు సంధి కంగీకరించి యుద్ధమును మాన్పవచ్చునని శ్రీకృష్ణుని యాశయము. దివ్యాంశమున జనించినవారే యయ్యును మానవ దౌర్బల్యమునకు లోనై యున్న భీష్మాదులు కృష్ణుడు ప్రతిపాదించిన లోకాతీత ధర్మస్వరూపమును గ్రహింపరైరి. కావున కృష్ణుడు వారి జీవితములందలి లోపములను, దోషములను ఉద్ఘాటించి, తదధర్మ పరిణామఫలమును తప్పక యనుభ

ఓంతురని వారిని హెచ్చరింపవలసి వచ్చినది. పాపుల పక్ష
మున నాశ్రయులైయున్న భీష్మద్రోణుల మనస్సులను వికల
మొనర్చి వారి ధైర్యస్థైర్యములను కుంఠితము లొనర్చుటయు
సుస్పష్ట ప్రయోజనమే. వీరమాతయగు కుంతీదేవి తన
హృదయగతభావమును, భీష్మద్రోణులు వినుచుండ స్పష్ట
మొనర్చుటయు, స్వధర్మ నిర్వహణమునుగూర్చి పాండవులకు
తన సందేశ మంపుటయు, ననుభారతస్థమగు నంశము ఈ
సన్నివేశమునకు పోషకమైనది. శ్రీకృష్ణుడు సాధింపదలచిన
విశిష్ట ప్రయోజనము, తత్సిద్ధికై కారణ జన్ముడగు నా దివ్య
పురుషుననుసరించు నసాధారణములగు విధానములు,
ముఖ్యమగు నంశము లీఘట్టమునందు సూచితములై భావికథా
ప్రవృత్తితో ననుసంధించుచున్నవి. ప్రథమాంకాంతమున
శ్రీకృష్ణుడు నిర్గమించుచు "నన్ననిచి వత్తువుగాని రమ్ము"
అని కర్ణు నాహ్వానించి తన వెంట గొనిపోవుట ద్వితీయాంకేతి
వృత్తముతో నన్వయించుచున్నది.

**ద్వితీయాంకము :** కృష్ణునితో మాటాడి వచ్చినప్పటి నుండియు కర్ణుడేదియో కళవళమునకు లోనై చింతాకులుడై యుండుట, తన్నర్ధరథుడని నిర్ణయించిన భీష్మునిపై కోపించి అస్త్రపరిత్యాగ మొనర్చుట, ముఖ్యమగు నంశములు దుర్యోధన దుశ్శాసనుల సంభాషణమువలన వ్యక్తములగుచున్నవి. తాను కుంతీపుత్రుడనియు పాండవులు తన సోదరులనియు నెరుగుటతో కర్ణుని హృదయమునందు పరివర్తనము కలుగక పోదనియు, తత్పరివర్తనము పాండవులకు క్షేమకరమనియు

శ్రీ కృష్ణుడెరుగును. శ్రీకృష్ణుని యుద్దేశము నెరవేరినది. హృదయోద్వేగమునకు లోనై యున్న కర్ణుడు భీష్మునిపై కోపించి అస్త్రసన్న్యాస మొనర్చినాడు. దానివలన పాండవులకు లాభము, తన ప్రభువగు సుయోధనునకు తీరని నష్టమును కలిగినదని గ్రహించి కర్ణుడు ఖిన్నుడగుట భావికథాప్రవృత్తికి హేతువగుచున్నది. అర్జునునియందు మాత్సర్యము వహించిన యేకలవ్యుని దుర్యోధన పక్షమున చేర్చుటకును, వానికి అస్త్రమంత్రముల నుపదేశించుటకు కూడ కర్ణుడు సిద్ధపడుటకును నతని యీ చిత్తవృత్తియే మూలమను సూచితమైనది.

**తృతీయాంకము :** మృగయా వినోదార్థ మడవికి నేగిన కర్ణున కేకలవ్యునితో యాదృచ్ఛికముగ సమాగమము కలుగుట, అతని యస్త్రవిద్యాకౌశలము పరీక్షించుటకు తగిన యవకాశమేర్పడుట, ఏకలవ్యుని హృదయగత భావమునుబట్టి యతడర్జునుని జయింపగలడను విశ్వాసముచే నతనిని కర్ణుడు తమ పక్షమున చేర్చుకొనుట, యను సంశయములిందు ప్రధానములైనవి. 'శస్త్రమునుబట్టనని ప్రతిజ్ఞ యొనర్చిన శ్రీకృష్ణుడెట్లర్జును నిపుడు రక్షించునో చూచెదగాక' యను కర్ణుని వాక్యము భావికథా ప్రవృత్తితో ననుసంధించుచున్నది.

**చతుర్థాంకము :** కర్ణుడేకలవ్యుని తో డ్తెచ్చుట, ప్రతివీరనిర్ణయార్థము జరుపబడిన శస్త్రాస్త్ర ప్రదర్శనమునుబట్టి యేకలవ్యు డర్జునునకు ప్రతివీరుడుగా నిర్ణయింపబడుట, కర్ణుడతని కస్త్ర మంత్రోపదేశము చేయ నిశ్చయించుట,

మున్నగు విషయములు కుంతీయుయుత్సుల సంభాషణము వలన వ్యక్తములగుచున్నవి. కర్ణుని యీ ప్రయత్నమును గూర్చి శ్రీకృష్ణునకు తెలుపవలయునని కుంతి నిశ్చయించుట ముందుకథ కాస్పదమగుచున్నది. ధృతరాష్ట్రుని కుమారులలో నొకడగు యుయుత్సుడు భారత యుద్ధారంభ సమయమున కౌరవ పక్షమును వీడి ధర్మజ పక్షము నాశ్రయించినట్లు భారతమున గలదు. ధర్మపరుడగు యుయుత్సుడు ద్రౌపదీ పరిభవము నాటినుండియు పాండవ పక్షము వహించినట్లును, పాండవుల అరణ్యాజ్ఞాతవాస కాలమున కుంతిని సేవించుచు నామెకు దుఃఖోపశమనము గావించుచు నుండినట్లును నిందు కూర్పబడినది.

పంచమాంకము: హస్తినాపురమునుండి మరలివచ్చిన శ్రీకృష్ణునితో నర్జునుడు సంభాషించుట, కుంతి పంపిన సందేశమును గ్రహించి కృష్ణుడు కర్ణుని ప్రయత్నమును భగ్నమొనర్చ బూనుట, యనునవి యీ ఘట్టమునందు ప్రధానాంశములు. యుద్ధరంగమున శ్రీకృష్ణు డర్జునునకు గావించిన తత్త్వబోధ కీ ఘట్టమందలి కృష్ణార్జున సంభాషణము ప్రాతిపదిక యగుచు శ్రీకృష్ణుని జీవితలక్ష్యమును సూచించుచున్నది. అంకాంతమందలి "అర్జును నెట్లు రక్షింతునో చూచెదరు గాక" యను శ్రీకృష్ణవాక్యము ఉత్తరాంకేతివృత్తముతో ననుసంధించుచున్నది.

షష్ఠాంకము: శ్రీకృష్ణు డరణ్యమునం దేకలవ్యుని కలిసికొనుట, కౌరవులు ధర్మవిద్రోహులగుటవలన తత్సహాయులు

కూడ పాపులేయని యేకలవ్యునకు నిరూపించి యతనిని కౌరవ పక్షమునుండి తప్పింప ప్రయత్నించుట, కృష్ణుని వాక్యము లందలి సత్యమును గ్రహించియు నేకలవ్యు డధర్మ పథమును వీడకుండుటచే కృష్ణు డతనిని సంహరించుట, యనునవి ఈ ఘట్టమందలి ముఖ్యాంశములు.

శ్రీకృష్ణుడు మానవమాత్రుడు కాడనియు దుష్టశిక్షణ శిష్టరక్షణలచే ధర్మమును పునరుద్ధరించుటకై మానవరూప మున నవతరించిన జగద్రక్షకుడనియు, తద్విశిష్ట ప్రయోజన మును సాధించుటలో నత డవలంబించిన విధానములును అప్రాకృతములనియు, ప్రాపంచికమగు మాయకు, బంధనము లకు నతీతుడై లోకకళ్యాణము నుద్దేశించి యతడు భారత యుద్ధమును సంగ్రామరూపయజ్ఞముగ నిర్వహింప బూనె ననియు నీ ఘట్టము వివరించుచున్నది. శ్రీకృష్ణుడు నిర్వహిం చిన ప్రతి కార్యమునందును మానవత్వ దివ్యత్వములు రెండును ప్రత్యక్షముగ భాసించుచున్నవి. సాధురక్షణ దుష్ట శిక్షణ విషయములలో నత డవలంబించు విధానమున కూడ ప్రత్యేకతకలదు. సాధువర్తనులగు ధర్మజాదులు కూడ నకుంఠిత మగు స్వప్రయత్నముపై నాధారపడియే ధర్మబద్ధమగు స్వప్ర యోజనమును గాంచియున్నారు. ఆది నుండి తుదివరకును శ్రీకృష్ణు డుపదేష్టగను మార్గదర్శకుడుగనుండి, వారిచే నాయా కర్తవ్యములను నిర్వహింపజేసి, ధర్మమును రక్షించి నాడు. సత్యధర్మములకు భంగము కల్గుటకును, పాపము వృద్ధి యగుటకును నా సంఘమందలి ప్రజలే బాధ్యులగుదురు. కావున సత్యధర్మముల రక్షణయు వారి ప్రయత్నమువలననే

జరుగవలసియున్నది. ధర్మపరులు, సత్యసంధులునగు వ్యక్తు
లను సాధనములుగ నొసి పాపులను నశింపజేసి, ప్రజలను
ధర్మమార్గోన్ముఖుల గావించుటయే ధర్మసంస్థాపనయగును.
ధర్మబద్ధము సత్యన్యాయపోషకమునగు స్వకర్మము ననుస
రించి మానవుడు జీవితమున పరిణతి నంది తాను తరించుచు
నితరులను తరింపజేయవలసియుండును. న్యాయబద్ధమగు జీవి
తము సుకరముకాదనుట పాండవుల జీవితమునుబట్టియే
స్పష్టమగుచున్నది. ఐనను, అట్టి జీవితమే ఉత్తమము. లోక
కళ్యాణప్రదమునని భారతమున నిరూపింపబడినది. పాపులను
నశింపజేయుటయందు, శ్రీకృష్ణుడు పాటించిన విధానముకూడ
గమనింపదగినదియే. కంస జరాసంధ శిశుపాలాదు లెల్లరును
తమ దుష్ప్రవర్తనమును బట్టియే లోకముచే గర్హితులై,
రాక్షసులుగ పరిగణింపబడి, తమ వినాశమును తామే తెచ్చు
కొనిరి. తాను స్వయముగ సంహరించినట్టియు, నితరులచే
సంహరింపజేసినట్టియు లోక కంటకులగునట్టి వారి విషయ
మునగూడ శ్రీకృష్ణుడు ముందుగా ఆత్మ సంస్కరణమునకును,
నాత్మ రక్షణమునకును నవకాశ మొసంగియుండుట చూడ
నగును. ఎంతకును దుష్పథమును వీడక ధర్మవిద్రోహులై
పరిణమించినవారిని కడపట శ్రీకృష్ణుడు నశింపజేసియున్నాడు.
ధార్తరాష్ట్రుల విషయమునను అట్లే శ్రీకృష్ణుడు కడపటివర
కును నానూపాయములను ప్రయోగించి, యవి వారికి రుచింపక
పోగా యుద్ధమును ప్రవర్తింపజేసి, పాపవినాశము గావించెను.
పరశురామాద్యవతారములలో భగవంతుడే స్వయముగ
దుష్టశిక్షణము గావించియున్నాడు. వ్యక్తిగత ద్వేషముచే

తన్నెదిర్చిన కంస శిశుపాలుర సంహార విషయమునవప్ప
తక్కిన సందర్భములలోనెల్ల శ్రీకృష్ణుడు ధర్మపరులకు సహా
యుడుగ మాత్రమేయుండి దుష్టసంహారమును జరిపించినాడు.
శ్రీకృష్ణు డవతారపురుషుడనెడు భావము లోకమునందు
పూర్తిగ నేర్పడలేదు. ధర్మజాదుల విషయమునకూడ నీ
జ్ఞానము స్వల్పాతిస్వల్పమైయున్నది. శ్రీకృష్ణు డనేక సందర్భ
ములలో తన దివ్యాద్భుతశక్తులను ప్రదర్శించినను ప్రాపం
చిక మాయాపాశములలో చిక్కియున్న లోకులతని నిజస్వరూ
పమును పూర్తిగ గుర్తింపలేదు. శ్రీకృష్ణుని దివ్యరూపమును
భౌతిక చక్షువులచే దర్శించియు తదుపసంహారముతో ధృత
రాష్ట్రుడే కాక భీష్మద్రోణాదులు కూడ మరల ప్రాపంచిక
బంధములలో చిక్కుకొన్నారు. తన్ను బంధింపబూనిన
దుర్యోధనాదుల మౌఢ్యత్వమును నిగ్రహించుటమాత్రమే
శ్రీకృష్ణుని యాశయముకాదు. భారతయుద్ధమున కంతకును
మూలమగు ద్రౌపదీ పరిభవము జరిగినది కౌరవసభలో.
సభాసదులగు వారెల్లరును నా పాపాచరణమునకు బాధ్యులే.
దివ్యరూప సందర్శనమువలన శ్రీకృష్ణుని దివ్యత్వము ధృత
రాష్ట్రుడును, భీష్మద్రోణాదులును గ్రహింపగలుగుచో వార
లని యుపదేశము ననుసరించి లోకానర్థ హేతువగు యుద్ధ
కర్మను మాన్పుదురని కృష్ణుని యుద్దేశము. కాని నైతిక
దౌర్బల్యపతితులు నహంకార దూషితులు నగు కౌరవ పక్షీ
యులు శ్రీకృష్ణుని యుదారాశయమును నతని దివ్యములగు
శక్తి సామర్థ్యములను గ్రహించియు గ్రహింపని వారయిరి.
శ్రీకృష్ణు డుద్దేశించిన లోక కళ్యాణము సామముచే సాధ్యము

కాలేదు. ధృతరాష్ట్రాదులకు ప్రధానాలంబులుగనున్న భీష్మ ద్రోణులును, కర్ణుడును, యుద్ధవిముఖులగుచో ధృతరాష్ట్రుడు జంకి సంధి కొడబడుననియు శ్రీకృష్ణు డూహించినాడు. దాని ననుసరించి శ్రీకృష్ణుడు భీష్మద్రోణులను హెచ్చరించియు, కర్ణున కతని జన్మరహస్యమును దెలిపియు, భేదోపాయ మును ప్రవర్తింపజేసియున్నాడు. అదియు ఫలింపకపోగా నిక దండ నీతిచే తప్ప పాపవినాశము జరుగదని శ్రీకృష్ణుడు నిశ్చయించి తన్నిర్వహణమున కుద్యుక్తుడైనాడు. యుద్ధ కర్మవలన కలుగు ప్రజానాశమెట్టిదో శ్రీకృష్ణు డెరుగనివాడు కాడు. దోషులగువారు మాత్రమేకాక వారి బంధుమిత్రా దులుకూడ నశింతురనియు నత డెరుంగును. ఇది ప్రకృతి సహజమైన విషయము. తమ పాపాచరణమువలన తాము మాత్రమేకాక తమవారుకూడ,-నిర్దోషులైనను-శిక్షితులగుదు రను భావము స్థిరముగ నేర్పడినప్పుడే లోకులు పాప ప్రవృత్తికి దూరులగుట కవకాశము కలుగును. అట్టి భావము కలి గించుటకు భారతయుద్ధ మావశ్యకమైనది. ఈ యనర్థమున కంతటికిని కారకులగు దుర్యోధనాదులు మాత్రమేకాక తత్ప క్షమున జేరిన వారందరును నశింపవలసి వచ్చినది. పాండవ పక్షమున జేరినవారి నాశమును నట్లే యవసరమైనది. ద్యూత విషయకమైన ధర్మజుని దోషమువలని ఫలము నతని పక్షము వారెల్లరును, - అభిమన్యుడు-ఉపపాండవులు, ఇరావంతుడు. ఘటోత్కచుడు, విరాట ద్రుపదులు, - వీరు వారనక, పాప పుణ్య వివక్షలేక, యెల్లరును ననుభవింపవలసి వచ్చినది. దివ్యాంశ సంజాతుడగు భీష్ముడుకూడ శరతల్పముననుండి,

జన్మసిద్ధములైన దేహాభిమానాదులను జయించి, మాయ నుండి విముక్తుడు కావలసివచ్చినది. అట్టి జీవన్ముక్తునిచే కృష్ణుడు ధర్మజునకు ధర్మోపదేశము గావింపజేసియుండుట గమనింపదగినది. స్వధర్మ భ్రష్టుడగు ద్రోణునకు గలిగిన పరాభవము, మానవత్వమును విసర్జించి రాక్షసత్వము నాశ్రయించి పతితుడైన అశ్వత్థామ ఆత్మవినాశమును నిందను సంధింపదగినవి. ప్రజాపాలక పీఠమునందుండియు నబలామాన రక్షణమునకు బూనని ధృతరాష్ట్రుడును, తన యెదుట తన కుమారులచే సాటి స్త్రీకి జరిగిన యవాచ్యమగు పరిభవమును మాన్ప బ్రయత్నింపని గాంధారియు నెట్టి ఫలము ననుభవింప వలసివచ్చినదో, లోకమునకు సువ్యక్తము గావింపబడినది. నిజమగు పశ్చాత్తాపముచే నాత్మను సంస్కరించుకొని సత్య ధర్మముల నాశ్రయించుటో, లేక, పాపాచరణవలని యనర్థము ననుభవించుటో తప్పదనెడి జ్ఞానము ప్రజలలో కలుగవలెను. సత్యధర్మములు సంఘమున సుప్రతిష్ఠితములగుట కదియే పునాది. భారతయుద్ధముచే శ్రీకృష్ణుడు సాధింపదలచిన ప్రధాన ప్రయోజనమును నిదియే. భారతయుద్ధమున పాల్గొనని రాజులనుకూడ, — సామముననో, దండముననో, ధర్మోన్ముఖుల గావించుటకై అశ్వమేధ నిర్వహణ మవసరమైనది. శ్రీకృష్ణు డారంభించిన యీ ధర్మ సంస్థాపనకు యాదవ నాశమును నావశ్యకమైనది. అహంభావమునకును, నింద్రియ ప్రవృత్తికిని దాసులై పాపమున బ్రవర్తించిన వారెంతటి వారైనను, నెవ్వరైనను, నశింపక తప్పదనెడు ప్రకృతి సత్య

మును శ్రీకృష్ణుడు యాదవ వినాశముచే లోకమునకు ప్రత్య క్షము గావించి, స్వప్రయోజన సిద్ధినొంది, నిర్వికారమైన చిత్తముతో నవతారమును చాలించియుండుట గమనింపదగి నది. విశ్వరూపుడగు భగవంతుని చిత్స్వరూపమే శ్రీకృష్ణుని యవతారమని మనము గ్రహింపవలసియున్నది. సృష్టిస్థితి లయములకు మూలమగు నావిశ్వరూపము శ్రీకృష్ణునిచే విశిష్ట సందర్భములలో ప్రదర్శితమైనది. రాజసూయాధ్వరసమయ మున జరిగిన శిశుపాలవధ, పరమాత్మ స్వరూపుడగు శ్రీకృష్ణునియందు శిశుపాలునియాత్మ లీనమగుట సభాసదు లెల్లరును ప్రత్యక్షముగగాంచిన విషయములే. విశ్వమందలి యాత్మలన్నియు భగవంతుని యంశములే యగుట నవి మరల నందే లీనమగుచున్నవి. సర్వదేవాత్మక మగు శ్రీకృష్ణుని విశ్వరూపము ధృతరాష్ట్రుని సభలో ప్రత్యక్షమొనర్పబడినది. సూర్యచంద్రాగ్ని యమవరుణాదులు, భగవంతుని శివకేశ వాది వివిధరూపములు, అన్నియు శ్రీకృష్ణునిదేహ మందలి వివిధాంశములై కన్పట్టినవి. అట్టి సర్వదేవతాత్మకుడగు శ్రీకృ ష్ణుడు పాండవపక్షముననుండ, తమకు రక్షకుడే లేడనెడు జ్ఞానము కౌరవపక్షీయులకు కలుగలేదు. ప్రాకృతికమగు మాయ వారియెడ నంతటి బలీయమైనది. శ్రీకృష్ణుడు నిర్వ హించిన భారతయుద్ధ కర్మయం దతనికి ప్రధానసాధనమైన వాడు అర్జునుడు! అతనిని మాయావిముక్తు నొనరించి, ధర్మ సాధకుడుగ దిద్దుటకు శ్రీకృష్ణుడు రణరంగమున స్వస్వరూపము ప్రదర్శింపవలసి వచ్చినది. బాల్యమునుండియు శ్రీకృష్ణుడు

ప్రదర్శించిన దివ్యాద్భుతశక్తులను గమనించి యతని దివ్యత్వ మును, అప్రాకృతత్వమును, గ్రహించినవారు ఉద్ధవాక్రూర విదురాదులు కొందరుమాత్రమే. తక్కినవారు తమప్రాకృత త్వమును దాటలేనివారై భవబంధములలోబడి తమకర్మ ఫలము ననుభవించినారు.

శ్రీకృష్ణు డప్రాకృతపురుషు డనెడు భావము తోడనే యతడొనర్చిన వివిధకార్యములను, దుష్టశిక్షణ శిష్టరక్షణల యందతడవలంబించిన విధానములను మనము గ్రహింపవలెను. శిఖండిని ప్రయోగించి భీష్ముని నిగ్రహించుట, ద్రోణుని పతన మునకై ధర్మజునిచే నసత్యము పలికించుట, సైంధవవధార్థము మాయాప్రయోగ మొనర్చుట, క్రుంగిన రథచక్రము నెత్తు చున్న కర్ణుని గొట్టించుట, ఉత్తరాగర్భమును రక్షించుట, అశ్వత్థామశిరోరత్నమును గ్రహించి యతని తేజమును హరించుట, యాదవనాశమునకు దోహద మొనర్చుట మున్నగుకార్యము లన్నియు నిందను సందేయములు. శ్రీకృష్ణుడొనర్చిన యేకలవ్య సంహారమును నట్టిచర్యలలో నొక్కటి. తద్వధవిధానము న్యాయ్యమగునా యనుప్రశ్న కేకలవ్య శ్రీకృష్ణుల సంభాషణమునందే సమాధానమున్నది. సంఘసూత్రములు, ధర్మములు ననునవి సంఘస్వాస్థ్యము నుద్దేశించి యేర్పడినవి. సంఘమందలి వారెల్లరును పాటించి నప్పుడే వానికి విలువయేర్పడును. ధర్మవిప్లావకులు, ధర్మ విద్రోహులు నగువారివిషయమునందు సంఘధర్మములను పాటింపవలసిన యవసరములేదు. యుద్ధధర్మములను పోద్రోలి,

క్రూరులై యభిమన్యువధ గావించిన ద్రోణకర్ణాదుల విషయమునందు యుద్ధధర్మములు పాటింపబడవలసిన యగత్యమును లేదు; అవి తమయెడ వర్తింపవలెనని కోరుటకు వారికర్హతయు లేదు. ఈ విశిష్టసత్యమును, శ్రీకృష్ణు డాయాసందర్భములలో వాచ్యమొనర్చియే యున్నాడు. మరియు లోకమున పెచ్చుపెరిగి యున్న పాపభావమును నిర్మూలించి ధర్మమును మరల ప్రతిష్ఠించు లక్ష్యముతో నవతరించిన శ్రీకృష్ణభగవానుని దృష్టిలో ధర్మద్రోహు లెల్లరును తృణకీటకములవంటివారే. లోకకంటకు లగువారిని నిర్మూలించుటయందు భగవంతు డనుసరించు విధానము మానవమాత్రుల మగు మన బుద్ధికగోచరమైనది. అవతారపురుషుడు, లోకాతీతుడునగు శ్రీకృష్ణునిచర్యల విషయమున మనలోక ధర్మము లన్వయింపకపోవచ్చును. ధర్మసంస్థాపనము ఫలముగా భారతసంగ్రామయజ్ఞమును నిర్వహింప బూనిన శ్రీకృష్ణుని కర్మమార్గమునం దేకలవ్యుడొక అల్పాల్పమగు కంటకము. కావుననే శ్రీకృష్ణుడద్దానిని తృణకంటకమువలె నలిపివైచినాడు. శ్రీకృష్ణు డేకలవ్యుని మరియొకవిధమున నిగ్రహించినట్లు కల్పించి యుండరాదాయను ప్రశ్నయు కొందరికి కలుగవచ్చును. తన దివ్యమహిమచే శ్రీకృష్ణు డేకలవ్యు నంధునిగ నొనర్చియో, లేక, దివ్యాద్భుతప్రదర్శనముచే జ్ఞానోదయము కల్గించియో ఉద్దిష్టప్రయోజనము సాధించి యుండవచ్చును. కాని అట్టి దివ్యాద్భుత ప్రయోగములకు సామాన్యుడు నల్పుడునగు నేకలవ్యుడర్హుడు కాడనుట గమనింపవలయును. రాజసూయాధ్వర

మహాసభ, కురుసభ, సైంధవవధ మున్నగు సందర్భములందు దివ్యత్వమును వ్యక్తమొనర్చుటచే శ్రీకృష్ణుడుద్దేశించిన ప్రయోజనము, విశిష్టము, విశాలమునైనది. ఏకలవ్యుని వంటి కీటకసదృశులపై శ్రీకృష్ణుడు తనదివ్యశక్తిని ప్రయోగించుట పిచ్చుకపై నొనర్చు బ్రహ్మాస్త్ర ప్రయోగమువంటిది. మరియు అధర్మమునకు, నన్యాయ్యమునకు మనఃపూర్వకముగ చేయూతనొసంగుచు, సత్యధర్మములకు హానికలిగించుచుండు పాపులను భగవంతు డేవిధమున నిగ్రహించుననెడి విషయము మనకు దురూహ్యమైనది. మానవమాత్రులమగు మన యల్పజ్ఞానమును, మానవ సంఘమునకు మాత్రమే పరిమితములై యున్న నియమములు నిత్యాదులును ప్రకృతి స్వరూపుని చర్యల కన్వయింపవు. ధర్మసంస్థాపనార మవతరిల్లిన విశ్వరూపుడగు శ్రీకృష్ణుని చిద్విలాసములలో నొకటిగా నేకలవ్య సంహారమును భావించి నేనీరచన గావించితిని. భారతసంగ్రామ నిర్వహణమునకు బూనుకొన్న శ్రీకృష్ణునియందు నాకు గోచరించినది కాలపురుషుని స్వరూపము. శ్రీకృష్ణుడు యాదవులనెల్లరను సముద్రతీరమునకు తరలించుకొనిపోయిన మౌసలపర్వ కథాసందర్భమునందును తత్స్వరూపమే గోచరించుచున్నది. ఏకలవ్యసంహారము నొక లీలగ నిర్వర్తించి, భారత సంగ్రామమునకు బూనుచున్న శ్రీకృష్ణుని తద్దివ్యస్వరూపమును చిత్రించుట నా ఆశయము. నాప్రయత్నమెంతవరకు ఫలించినదనుటకు సహృదయహృదయమే ప్రమాణము.

భూపతి లక్ష్మీనారాయణరావు.

# ధర్మరక్షణము

ఏ దేవుండు సమస్తలోకములఁ దానే వేళ సృష్టించునో
యే దేవుం డసమానమైన దయతో నీక్షించి రక్షించునో
యే దేహాంతకుఁ డాత్మయందు సకలం బేకంబు గావించునో
యా దేవుం డురుధర్మ రక్షణకునై యావిర్భవించుఁ భువిన్.

## ప్రథమాంకము

[హస్తినావతిలో విదురునిగృహము. ఆయాస్థలములలో నుచితాసనము లుండును. సేవకులు ద్వారమున నిరీక్షించు చుందురు. విదురుడు ముందునడచుచుండ శ్రీకృష్ణుడు గంభీర మందగమనమున ప్రవేశించి నడుమనున్న యాసనమునం దుపవిష్టుడగును. భీష్మద్రోణులు కృష్ణుననుసరించి ప్రవేశించి, విదురుడు నిర్దేశింప కృష్ణునకొక ప్రక్కగా కూర్చుందురు. సేవకులు పానీయమును దెచ్చి కృష్ణునకు సమర్పింతురు.]

**కృష్ణుడు** :—విదురా? ధృతరాష్ట్రుని తుదిపల్కులను వింటివికదా! తనదెస తప్పులేదనియు తానేమిటికిని ముఖ్యుడుకాడనియు చెప్పివిడిచె. కురువంశక్షేమమును ప్రజాహితమును నాశించి నే నొనర్చిన సంధిప్రయత్న మిట్లు విఫలమైనది. యుద్ధమువలన కలుగనున్న దారుణమగు పర్యవసానమును గుర్తింప జాలనంతటి యంధుడందువా ఆంబికేయుడు!

**విదురుడు :**—దేవా ! ధృతరాష్ట్రుని స్వభావము మీకు క్రొత్తయా ! లోభదూషితుడు, రాగాంధుడునగు నితనివలననేకదా కురువంశ మింతటి యప్రతిష్ఠపాలైనది. పుత్రవ్యామోహావిష్టుడై కులవధూపరిభవమునుకూడ సహింప గలిగినవాడు సంధికంగీకరించుననియు, త్రయోదశాబ్దములు నిరంతరాయముగ ననుభవించిన రాజ్యభాగమును వదలు కొనుననియు నాశించి వచ్చితివా ?

కృష్ణ :—విదురా ! అటుకాదు. కౌరవులు సమయ పాలన మొనర్తురనికాని, న్యాయ్యము జరుగుననికాని నే నాశింపలేదు. ఐనను సంఘమంతయు నజ్ఞానాంధ కారమున బడి, కట్టగట్టుకొని అత్యుగ్రమగు మృత్యుగహ్వరమున నురుక నుండ అట్టిమూర్ఖత మాన్చుట పుణ్యమని విశ్వసించి వచ్చితిని. మఱియు న్యాయ్యసత్యములను రక్షింప దక్షులగు భీష్మ ద్రోణులు కూడ నిట్లు ధర్మభీరువులు సత్యదూరులునై పాపుల పక్షము వహింతురని యూహింపనైతిని.

**భీష్ముడు:**—మహాత్మా ! నిరపరాధులమగు మమ్మ గోపింపకుము. మే మస్వతంత్రులమగుట నీకు తెలియదా ?

కృష్ణ:—పితామహా ! ఎంతటి యాత్మవంచన యిది! కురుసామ్రాజ్య విస్తారకుడు, వంశరక్షకుడు, వీరాధ వీరుడు కురువృద్ధుడునగు శాంతనవు డస్వతంత్రుడా ? పాపమార్గ ప్రవర్తకులు, ధర్మనాశకులునగు కౌరవులకు రక్షకుడవైన నీవు నిరపరాధుడవగుదువా ? బ్రాహ్మణ కులాచారమును

మంటగలిపి, దారుణమగు హత్యాకాండకు బూనుకొన్న ద్రోణాదులు ధర్మపరులెట్లగుదురు ? భీష్మా! మీవంటివారి కారణమున సత్యమెంత తలక్రిందైనది.

ద్రోణుడు :—తండ్రీ ! మమ్మెందుల కన్యథా తలంచెదవు ? కౌరవుల పోషణలోనున్న మేము వారియాజ్ఞను పాలింపక తప్పదుకదా ?

**విదురుడు :** — ఆచార్యా! కురుకుమారుల కస్త్రవిద్యాగురుడుగ నియుక్తుడవైన నీవు పట్టెడన్నమునకై కొలువు చేరెడు సామాన్యసైనికుడ వనుకొంటివా ?

కృష్ణు:—ఆచార్యా ? కురువంశమున అస్త్రవిద్యాచార్యపీఠము నలంకరించిన నీవు కూటికై పోరెడు సామాన్యసైనికునివలె ఆత్మ నమ్ముకొనవలసి వచ్చినదా ? ధర్మరక్షణైకపరులైన సుక్షత్రియుల శిక్షణార్థము ధనుర్వేదము నభ్యసించిన బ్రాహ్మణులు నీవలె స్వహస్తములను రుధిరముచే కలంకితమొనర్చుకొందురా ? ధర్మరక్షకుడవై గురుస్థానము వహింపవలసిన నీవు ఏనాడు క్రోధమునకు లోనై మత్సరగ్రస్తుడవై పాంచాలురపై కత్తిగట్టితివో నాడే బ్రాహ్మణత్వమునుండి పతితుడవైతివి. స్వధర్మభ్రష్టుడవగు నీవును నీకుమారుడును ఎట్టి రాక్షసకృత్యముల కైనను వెనుదీయరని నే నెరుగుదును. కాని దైవము మిమ్మును మీరాక్షసత్వమును నిగ్రహించి సత్యధర్మములను రక్షించి తీరుననుట గుర్తింపుడు. బ్రాహ్మణానుచితమగు నీ దీర్ఘక్రోధమే ధృష్టద్యుమ్న.

రూపమున నుద్భవిల్లి నిన్ను హతమార్ప వేచియున్నదని గుర్తింపుము. ఈవిధమగు నాత్మవినాశముకంటెను తపోవృత్తిమై అరణ్యముననైన నివసించుట మీయట్టివారికి శ్రేయము కాదా ?

భీష్మ:—కృష్ణా ! ఈతరుణమున మేము యుద్ధమునకు వెనుదీయుట దుష్కీర్తికి హేతువగునుకదా ?

కృష్ణ :—శాంతనవా ! అధర్మ ప్రవృత్తిని విడనాడుట అపకీర్తికి హేతువందువా ? అతిరథమహారథాధికుడవనెడు పేరుతప్ప ఈయుద్ధాచరణమున నీకు లభించెడి కీర్తి యెట్టిది ? సమక్షమున నొకకులకాంత పరిభవింపబడుచుండ దక్షుడవయ్యును మాన్పబూనకుండుట కీర్తిదాయకమయ్యెనా ? నాడు నీవొక్కడవు ప్రాణముల నొడ్డి నిలిచియుండిన నంతటి పాపండకృత్యము జరిగియుండెడిదా ? నాటి పాపఫలము నిన్నును, ఈద్రోణుని, సభలోనున్న ప్రతివ్యక్తిని కట్టికుడుపక పోదనుట జ్ఞాపకముంచుకొమ్ము. మిమ్ములనండగా జూచుకొనియేకదా ధృతరాష్ట్ర దుర్యోధనులు సంధికంగీకరింపకున్నారు. భీష్మా ! జరుగనున్న మహానర్థమునకు మీరు పరోక్షకారకులనుట గుర్తింపుడు. మీరు కోరుచున్న సంగ్రామ మిదిగో, మీకభిముఖమై వచ్చుచున్నది. సంతసింపుడు. భీష్మా ! దైవదత్తములగు శక్తిసామర్థ్యములచే గర్వితుడవై అంబాకుమారి జీవితవినాశమునకు కారకుడవగుట విస్మరించితివి కాబోలు. ఆ అధర్మపరిణామమే రణరంగమున నీయెదుట ప్రత్యక్షముగ నిలిచి నీ పతనమునకు హేతువు కా

గలదు. అసత్యము, అధర్మము పక్షములుగా, అహంభావ ముచే కన్నుగానక సంగ్రామాగ్నిబడనున్న ధార్తరాష్ట్ర శలభములతో మీరును అందు నశింపక తప్పదు. మహావీరుల మని, దివ్యాంశసంజాతులమని, అజయ్యులమని, విఱ్ఱవీగెడి మీరును, మీకు బాసటయైనిలుచు భగదత్తాదులును, ఎల్లరును దైవము దృష్టిలో దుష్టకీటకములే. లోకానర్థకరులరగు మిమ్ములను పాములనెట్లు అట్లు చంపినను తప్పులేదు. ధర్మ సంస్థాపనమే ప్రయోజనముగా ధర్మజుని కర్తగానిడికొని ఈ సంగ్రామ యజ్ఞమును నిర్వహింపబూను నాకు ఎవరడ్డము వత్తురో చూచెదగాక.

[కుంతీదేవి ప్రవేశము. ఎల్లరును నిలుతురు. కృష్ణుడామె పాదములకు నమస్కరించి, యామె నాసీనంజేసి తానును నుపవిష్టుడగును.]

కుంతి:—మాధవా? నీసంధిప్రయత్నము విఫలమైనదటకదా? ఇకనైనను ధర్మజుడు క్షాత్రధర్మమున బ్రవర్తించునా? లేక యాచకవృత్తి నవలంబించి వంశమునకు దైన్యము నాపాదించునా?

కృష్ణు:—తల్లీ! యుద్ధమును, కౌరవవినాశమును నెట్లును తప్పవు. ఐనను లోకదాహకమగు యుద్ధమును సర్వవిధముల మాన్పబూనుట ఉత్తమధర్మము. ఈసంధిప్రయత్నముచే కౌరవపాండవుల స్వభావములు నాశయములు లోకమునకు వ్యక్తములైనవికదా? అది మనకు విజయహేతువు.

ధర్మజుని నిజస్వరూపమును శీఘ్రమే కౌరవులు కాంచగలరు. పాపులను భస్మమొనర్చికాని సత్పురుషుని కోపము చల్లారదు. నీవు శంకమానుము. నీకుమారులకు సందేశమును ధైర్యమును చెప్పిపంపుము,

**కుంతి:**—మాధవా! కులధర్మమును పాటించి నిజ వంశోచితమగు వీరవృత్తమున బ్రతుకుడనుటకంటెను విశిష్ట సందేశ మేమున్నది? పరాక్రమ జీవనవృత్తి తక్క తక్కినవి రాజులకు నిషిద్ధములనుట నీవెరుగవా? పరుల నిట్లు యాచించి నిస్తేజస్కమగు కూటి కియ్యకొని దైన్యమునొందుట హేయ మని యుధిష్ఠిరునకు తోపలేదా? రాజసభలో ద్రౌపదికి జరిగిన పరిభవమునకు తగినప్రతీకారము గావింపనిచో భీమార్జునుల బలపరాక్రమములు వ్యర్థములని నే నంటిననుము. కృష్ణా! జగన్మాన్యుడవైన నీ విట్లు పాపముతో సంధియొనర్ప నంగీక రించిన నిక ధర్మమును రక్షించువారెవరు? అచ్యుతా! బాల్య మాదిగ నీవు సాధించుచున్న నీ జీవిత ప్రయోజనము నొకసారి స్మరించుకొనుము. పొమ్ము. పాండుకుమారులను సాధనము లుగా గొని దుష్టులను నిగ్రహించి సత్యధర్మములను లోక మున మరలప్రతిష్ఠింపుము. లోకకళ్యాణమగుగాక!

[భీష్మద్రోణు లొకరి మొగ మొకరుచూచుకొని తెల్ల వోదురు]

**కృష్ణు:**—వీరజననీ! నీయాశీర్వాద మమోఘము. ఉదాత్తమగు నీయాశయమును సమగ్రముగ నిర్వహించి పిమ్మట నిన్ను దర్శించెదను. ఈమహదాశయసిద్ధికై మన

మెంతటి త్యాగమునకైనను నెట్టి నష్టమునకైనను సిద్ధపడి యుండవలయునని మాత్రము హెచ్చరించుచున్నాను. మానినీ మానఘాతుకులగు కర్ణదుర్యోధనాదులు మాత్రమే కాక వారికి ప్రాపై నిలిచియున్న యీభీష్మద్రోణాదు లెల్లరను మృతకల్పులని యెఱుంగుము. ఇంద్రియప్రవృత్తియే ప్రధానముగా, లోకోపద్రవకరములై అసంఖ్యాకములై విజృంభించియున్న సకలనరరూప పశువుల విశసనమున దప్ప నీసంగ్రామయజ్ఞము పూర్తికాదు. ఈ నా మహాప్రయత్నమున కెవ్వరడ్డు తగిలినను వారినెల్లరను కీటకములవలె నలిపివైచి లోకమున మరల ధర్మమును ప్రతిష్ఠించెదను. తల్లీ! నన్ను దీవించి సెలవొసంగుము. [కుంతిపాదములకు నమస్కరించును]

**కుంతి:**—నీయాశయము సిద్ధించుగాక! [కృష్ణుని లేవనెత్తును]

[ప్రవేశము–దారుకుడును, కర్ణదుర్యోధనులును]

**దారుకుడు:**—దేవా! రథమాయత్తము కావింపబడినది. ప్రయాణమునకు ముహూర్తము సమీపించినదని సాత్యకిప్రభువు విన్నవించుచున్నాడు.

**కృష్ణు:**—దారుకా? వచ్చుచున్నాను. వేరొకరథమున నన్ననుసరింపుమని సాత్యకితో చెప్పుము. [కర్ణునిజూచి] కర్ణా! నన్ననిచివత్తువుగాని రమ్ము! [కర్ణునిహస్తమున గ్రహించి] పితామహా! ఆచార్యా! మీరిక నిలువుడు. రణరంగమున పునర్దర్శనమగునుగాక [నిష్క్రమించును.]

[తెరపడును]

## ద్వితీయాంకము

[దుర్యోధనుని భవనాంతర్భాగము. ఉచితాసనము లందందు అమర్చబడియుండును. దుశ్శాసనుడొక ప్రక్క నిలుచుకొని యుండ కంచుకి ప్రతీహారులు ద్వారము నొద్ద నిశ్శబ్దముగ ప్రతీక్షించుచుందురు. దుర్యోధను డాలోచనా నిమగ్నుడై ఇటునటు పచారు చేయుచు కొంతవడికి దుశ్శాసను నుద్దేశించి]

దుర్యో:—తమ్ముడా! కర్ణు డింత యాలసించుటకు కారణమేమై యుండును? పిలుచుట కెవరిని పంపితివి?

దుశ్శాసనుడు:—లక్ష్మణవృషసేను లిరువురును వెళ్ళినారు. ఇంతలోనే కర్ణుడు రాగలడు. సోదరా! శూరులు, నుదారులు నగు కర్ణవృషసేనులు సూతులవంగడమున నెట్లు జన్మించిరో! ఇది యాశ్చర్య కరముగ నున్నది.

దుర్యో:—(చిరునవ్వుతో) దుశ్శాసనా! బొగ్గుగనిలో జాతివజ్ర ముద్భవిల్లదు. సహజకవచకుండలుడు, సూర్య తేజో విభాసితుడు, శౌర్యనిధియు నగు కర్ణుడు హీనవంశజుడగునా? అట్లగుట అసంభవము. ఏ సుక్షత్రియకన్యయో యవనికాంతరమున ప్రసవించి, ఆభిజాత్యరక్షణార్థమై కుమారుని నదీప్రవాహమున విడిచి యుండును. కర్ణుడు క్షత్రియేతరుడై యుండజాలడు. ఆ శీలము, సౌజన్యము, ఔదార్యము, శౌర్యము కౌరవులలో నెవరికున్నవో చెప్పుము.

దుశ్శా :—నిజము. ఇంతటి పరాక్రమవంతు డిట్లు మరుగుపడియుండవలసి వచ్చినది. దీనిని గుర్తించియే కాబోలు ఇతర విషయములలో నభిప్రాయభేదము లెన్నియున్నను పితామహుడు కర్ణు నత్యాదరముతో చూచుచున్నాడు.

దుర్యో :—పితామహు డొకడే కాదు. రాయబారమునకై యిందువచ్చిన శ్రీకృష్ణుడుకూడ మరలిపోవుచు ప్రత్యేకముగ కర్ణు నాహ్వానించి రథమున కూర్చుండబెట్టుకొని చాలసేపు మంతనము లాడెనని వింటిమి. కర్ణుడు సుక్షత్రియ సంజాతుడనుటలో నేమియు సందేహము లేదు సుమా!

దుశ్శా :—అన్నా! ఇప్పుడు జ్ఞాపకమునకు వచ్చినది. కృష్ణునితో మాటలాడి వచ్చినప్పటినుండియు కర్ణుడేలకో ఉద్విగ్నమానసుడు, అన్యమనస్కుడునై యున్నాడని వింటిని. కారణమేమై యుండునో!

దుర్యో :—దుశ్శాసనా! కృష్ణుడు కర్ణునకేదియో యాందోళన కలుగజేసి అతని యుత్సాహమును కుంఠిత మొనర్చినట్లున్నది! మొన్న సభలో తన్నర్ధరథుడని పితామహు డన్నంతనే కర్ణుడెంత యుద్రేకమును ప్రదర్శించెనో చూచితివా? భీష్ముడు పడునంతవరకును తాను యుద్ధమున పాల్గొనసని శపథ మొనర్చుటలో కర్ణుని చిత్తక్షోభ వ్యక్తమగుచున్నది. సహజగంభీరుడగు కర్ణు డిట్లగుట కేదియో ప్రబలకారణము లేకపోలేదు. శ్రీకృష్ణుని ప్రయత్నమేదియో ఇందులకు హేతువని నా యభిప్రాయము.

[కంచుకి ప్రవేశము]

**కంచుకి** :—మహారాజునకు జయమగుగాక! అంగరాజుగారు వచ్చుచున్నారు.

**దుర్యో** :—మంచిది. ప్రవేశింపజేయుము. (ఎదురేగి కర్ణుని కౌగిలించుకొని తోడ్కొనివచ్చి ఆసీనుని గావించును. కర్ణుడు ఖిన్నుడుగ గన్పడుచుండును) కర్ణా! ఏమి నీయందలి యీ మార్పునకు కారణము. నిష్కలంక చరిత్రుడవగు నీకు మనోవ్యథ యెందులకు?

**కర్ణుడు** :—ప్రభూ! మీరు సుఖులైయుండ నాకు దుఃఖమెక్కడిది? భృత్యధర్మమును నిర్వహింపలేకపోయితిని కదా యని ఖిన్నుడనైయున్నాడను. భీష్మునిపై గలిగిన తాత్కాలిక కోపము కారణముగ శస్త్రమును త్యజించి మీకెంతయు నపకార మొనర్చితినని సిగ్గుచే క్రుంగిపోవుచున్నాడను. చిరకాలము మీ మన్ననలు బొంది, మీ భ్రాతృప్రేమను చూరగొని మంచి తరుణమున మిమ్ములను సేవించుటకు పనికిరానివాడనైతిని.

**దుర్యో** :—కర్ణా! చింత యెందులకు? నీ హృదయము నేనెరుగనా! పితామహుని నాయకత్వమున సంగ్రామ మెట్లు పరిణమించునో చూతము. వయోవృద్ధుడైనను నతని యెదుట అర్జునాదు లెవ్వరును నిలువలేరు. పాండవసేనలో మూడుభాగములు ఆహుతిగొందునని పితామహుడు నాకు మాటయిచ్చియున్నాడు. అవకాశము లభించుచో పాండవులయం దెవ్వరైనను నతని శౌర్యాగ్ని కాహుతికావచ్చును..

తనతమ్ములలో నెవ్వడు పడినను తానంతతో యుద్ధమునుండి విరమించుకొందునని ధర్మజుని శపథముకదా! అట్లు జరిగినచో మంచిదే. ఇప్పుడు యుద్ధమున నీవు పాల్గొనుటలేదను చింత యెందులకు? దిగ్విజయ మొనర్చిన నీ శక్తిసాహసములు జగద్విదితములు కావా?

కర్ణ:—మహారాజా! భీష్మద్రోణుల హృదయము మీకు తెలియదు. వారికి మీరెట్లు ప్రేమపాత్రులో పాండవులును నట్లే. భీష్మద్రోణు లెంత సైన్యమునైనను హత మొనర్తురు కాని పాండుకుమారు లెదురుపడినచో వారికి చేతులాడవు. పాండవులు తమ్ము కొట్టినకొలది వీరి కానందాశ్రువులు మెండగుచుండును. ఇది నేను పూర్వమే గమనించినాడను. ఉత్తరగోగ్రహణ సందర్భమునం దర్జునుని సమ్మోహనాస్త్రముచే పితామహుడు మూర్ఛితుడయ్యెనో లేక నవ్వుచు నోసరిల్లెనో మనకు తెలియదా? పాండవులను భీష్మద్రోణులు హింసింతురనెడి మాట మరచిపొండు.

దుశ్శా:—కర్ణా! కావచ్చును. ఐనను అర్జునుని యాటోపము నాపుటకు మేమెవ్వరమును లేమా?

కర్ణ:— యువరాజా! కోపింపకుము. అర్జునుని చాతుర్యము మీకు బోధపడదు. అస్త్రవిద్యను ఒక విశిష్ట కళగా పార్థుడు సాధించియున్నాడు. క్షణక్షణమును నతడు తన బాణప్రయోగవైఖరిని మార్చుచు భయదములు, మనోహరములు నగు దృశ్యములను ప్రతివీరునియెదుట సృష్టించుచు నతనిని విమూఢుని గావించును. శత్రువు వెరగంది

నిశ్చేష్టుడై నిలువ నర్జునుడు చిరునవ్వుతో లీలగా నతని కంఠము నుత్తరించును. ఈ ధనుర్విద్యా ప్రదర్శనమునకు భీష్మద్రోణులు మురిసిపోదురు. కనుక యుద్ధరంగమునం దర్జునుడు స్వేచ్ఛగ వీరవిహారము గావించును. అతని అస్త్ర కౌశల ప్రదర్శనమునకు హృదయమును గోల్పోవక ప్రతి ప్రయోగము గావించుచు నిర్దయతో నతనిని శాసింపగల క్రౌర్యము నాకొక్కనికే కలదు. నేను యుద్ధరంగమున లేనిచో నతని విశృంఖలత నడ్డుట యితరులకు సాధ్యము కాదు సుమా!

దుర్యో :— కావచ్చును. కాని కర్ణా! మించిపోయిన దానికై వగచిన లాభము లేదు కదా? సర్వదా నిన్ను ధిక్కరించుచుండు నశ్వత్థామ ఇప్పుడు తన ప్రతాపమును ప్రదర్శించి అర్జునుని విజృంభణము నరికట్టునీ! నేనతని నందులకై పురికొల్పెదను. నీవీ విచారమును మాని యెప్పటివలె ప్రసన్న మనస్కుడవై యుండుము. ఇప్పుడు నిన్ను పిలుచుటకు కారణము వేరున్నది. యుధిష్ఠిరునకు యుద్ధమున తోడ్పడుటకై శల్యుడు సైన్యసన్నాహముతో పోవుచున్నాడని వింటిమి. అతని నెట్లైన వంచించి, అతడు మనతో చేరునట్లును, నీకు సారథ్య మొనర్ప నంగీకరించునట్లును చేయవలసియున్నది. నే నతనిని మార్గమధ్యమున గలిసికొనుటకై పోవుచున్నాను. కనుక నీవును మాతో రావలయును.

కర్ణు :— ప్రభూ! నన్ను క్షమింపవలయునని ప్రార్థించు చున్నాడను. మొన్నటినుండియు నామనస్సేదియో యాందో

శనమునకు లోనయియున్నది. మరియు నా ప్రయోజనము నుద్దేశించి మీరు శల్యునితో ప్రసంగించునెడ నే నందుండుట ఉచితముగా తోపదు. కావున మీరు మరలివచ్చువరకును మృగయావినోదమున కాలము వెళ్ళబుచ్చ దలచియున్నాను. నాకోరికను మన్నింపుడని ప్రార్థన.

**దుర్యో** :—సోదరా! నీ యిష్టము. నేను తిరిగివచ్చు నప్పటికి నీవు నిశ్చింతుడవై, ఉల్లాసముతో నాకెదురు రావల యును సుమా! (అని కర్ణుని చేయిపట్టుకొని నిష్క్రమించును)

[తెరపడును]

---

# తృతీయాంకము

[అరణ్య మధ్యప్రదేశమునందు కర్ణుని శిబిరము. విశాలమగు వృక్షచ్ఛాయయందలి శిలాఫలకముపై బాహువుపధానముగా కర్ణుడు విలాసముగ పడుకొనియుండును. పార్శ్వమున వృషసేను డొక జింకపిల్ల నొడిలో నుంచుకొని దానిని లాలించుచుండును. కర్ణునకు సమీపమున రెండు ధనుస్సులు, తూణీరములు నుండును.]

వృషసేనుడు :—తండ్రీ! ఇట్టి బంధురారణ్యమునందింత ప్రశాంతత నెలకొనియుండుట చాల వింత. క్రూరమృగమొక్కటియైన నిందున్నట్లు లేదే! ఏమాశ్చర్యము.

కర్ణు :—నిజము. ఇందు ప్రవేశించినప్పటినుండియు ఇదివర కెన్నడును లేని యనిర్వచనీయమైన యుల్లాసమేదియో నా మనస్సును లోగొన్నది. ఇట్టి ప్రశాంత వాతావరణము మన జీవితమునకు క్రొత్త. కుమారా! ఈ జింకపిల్ల యెక్కడిది ?

వృష :—తండ్రీ! అరణ్యప్రాంతమున స్వేచ్ఛగా విహరించుచుండు హరిణ సమూహమును గాంచి మన సైనికు లుత్సాహముతో కొన్ని జింకలను చంపిరి. వానిలో, పాపము! దీని తల్లియు చావగా నిది మనవారికి చిక్కినది. తండ్రీ! తల్లి లేని యీ కసుగందు జీవింపగలదా ?

కర్ణు:—[జింకపిల్లను చూచుచు నిట్టూర్పుపుచ్చి] కుమారా! పుట్టినవెంటనే తల్లియొడిని బాసి, ఆమె లాలన

పోషణలకు దూరులయ్యును బ్రదికి పెద్దవారైన నిర్భాగ్యు లెందరో కలరు సుమా! దీనిది మొండిప్రాణమైనచో నిదియు జీవింప గలదు.

[సేవకుడు ప్రవేశించి జంకుచు నిలబడును]

**వృష :**—ఏమి విశేషము ? ఎందు కట్లు జంకు చున్నావు ?

సేవకుడు:—[మెల్లగా] దేవా ? ఎవ్వడో కోయరాజు విల్లమ్ములతో అతిరభసముగ శిబిరమును ప్రవేశించినాడు. మిమ్ములను చూచి తీరవలయునట. మే మతని నాపజాల కున్నాము.

**వృష :**—ఏమీ! శబరునొక్కనిని పలువురు మీ రడ్డుకొనలేరా ? ఏడీ! చూతము రమ్ము! [అని లేచును].

**కర్ణ :**—[చేతితో వృషసేను నాపి] కుమారా! ఈ యుద్ధతు డెవ్వడో చూతము. సేవకా! అతనిని రానిమ్ము.

**సేవ :**—చిత్తము [అని నిష్క్రమించును].

[దీర్ఘకాయుడు, ఆజానుబాహుడు, విపులోరస్కుడు, ధనుర్ధరుడు నగు శబరరాజును, నొక కుమారుడును ప్రవేశింతురు. కోయరాజు కర్ణవృషసేనుల నిరువుర నొకపరి చూచి తీక్ష్ణ దృక్కులతో కర్ణు నాపాదమస్తకము వీక్షించుచు నిలబడును. వికసించిన ముఖమున చిరునవ్వు దోప కర్ణు డెరుకరాజును జూచుచు]

కర్ణు:—పుళిందరాజా! కూర్చుండుము. నీ వైఖరి చూడ క్రుద్ధుడవని వ్యక్తమగుచున్నది. నీకు మావలన నేదియు కీడు జరుగలేదుకదా!

కోయరాజు:—[కర్కశస్వరముతో] మా యానతి లేక మావనము ప్రవేశించినదియేకాక మా పిల్లలవంటి జింకల నకారణముగ చంపుట కీడుగా తోపదు కాబోలు. అది మీకు క్రీడగదా!

కర్ణు:—ఆహా! అదియా! ఈ యపరాధము నా సైనికు లొనర్చినదే యైనను బాధ్యత నాయదియే. నష్టమునకు పరిహార మిప్పింతును. శాంతింపుము.

కోయ:—రాజా! నాకు ద్రవ్యాపేక్ష లేదు. విహారము కొరకై యీ యడవిని ప్రవేశించి ఏపాపము నెరుగని జింకలను నిష్కారణముగ చంపుట క్షత్రియుల కొక వినోద క్రీడ యైనది. ప్రతీకారము చేయజాలని వానిని హింసించుట క్షాత్రముకాదు. శౌర్యమును కాదు. ఆ విషయమును బోధపరచు నుద్దేశముతో వచ్చితిని. నా జింకలను హింసించిన నీ సైనికులను నీవు రక్షించుకొన్నను సరియే, లేదా నీవే నాతో పోరుదువా మిక్కిలి సంతోషము. ఇక ముందెప్పుడును బలహీనములగు వానిని బాధింపవు.

వృష:—[భీషణముగా జూచుచు] కోయరాజా! మేరమీరి మాటాడుచున్నావు. గౌరవ ప్రవర్తనము నీకు నేర్పి పంపెదను సుమా! జాగ్రత్త!

కర్ణ :—వృషసేనా ! నీవు మాటాడకుము. శిబిరము లోని కీ కుమారుని గొనిపోయి రుచ్యపదార్థములచే సంతోష పరుపుము. నే నీకోయరాజును శాంతింప జేయుదును.

[వృషసేనుడు శబరబాలునితో నిష్క్రమించును]

కర్ణ :—కోయరాజా ! బుద్ధిపూర్వకముగ చేయని దానికై వృథాకలహమేల ? పోరాటమున మనమే జయింతు మని నమ్మకమే మున్నది? శక్తిసామర్థ్యము లొకరిసొమ్ములు కావుకదా ! శాంతింపుము. స్నేహభావమును గుర్తింపుము.

కోయ :—రాజా ! మీమాటలు శాంతిప్రధానము లయ్యును శౌర్యగర్భితములై యున్నవి. చల్లని మీ చూపుల వెనుకనుండు నద్భుతశక్తి బాగుగ గోచరమగుచున్నది. మీ యాకృతి సాహసమును జాటుచున్నది. అట్టి మీతో పోరు టయే నా అస్త్రవిద్యకు తగిన గౌరవమని తలచుచున్నాను. అదికాక, అస్త్రపాండిత్యము క్షత్రియుల స్వత్వ మనుటలో ఎంత సత్యమున్నదో చూడవలెనను నభిలాషయు నాకు కలదు. కనుక నాతో పోరుటకు మీకభ్యంతరమేమి ?

కర్ణ :—[చిరునవ్వుతో] పుళిందాధిపా ! నీ యాశయ మును సాహసమును శ్లాఘనీయములైనవే. కాని కయ్యమున కైనను వియ్యమునకైనను సమత అవసరమగుట నీవెరుగనిది కాదు. నీతో వినోదమునకై పోరునప్పుడైనను అప్రయత్న ముగ నీకు హాని కలుగవచ్చును. అకారణముగ నే నొరులకు హాని చేయజాలను. ఈ నీ అభిలాషమును విడిచిపెట్టుము.

శబరుడు :—[రభసముతో లేచి నిలువబడి] రాజా! నీ నిషేధవాక్యములే నన్ను పోరునకు పురికొల్పుచున్నవి. కయ్యమునకు సమత కయ్యమే నిర్ణయించును లెమ్ము. ధనుర్బాణములను గైకొనుము.

కర్ణు:—శబరరాజా! నీ వెట్లును నీ పట్టుదల వదలునట్లు లేవు. ఐనను నేను చూపిన లక్ష్యమును నీ వేకైక ప్రయత్నమున భేదింపగల్గినచో నీతో పోరుటకు నే నంగీకరింతును. [అని ఆకసము వంకచూచి చేతితో నిర్దేశించుచు] అదిగో! బారులుకట్టి పోవుచున్న ఆపక్షులను చూచితివా! ఒకటి, ఐదు, తొమ్మిది బారులలో వరుసగా ఒకటి, ఐదు, తొమ్మిది సంఖ్యలపక్షులను మూడు బాణములచే నొక్కసారిగా కొట్టుము చూతము.

శబర :—[నవ్వి] ఇదియా లక్ష్యము! [కుడిచేత ధనువునుబట్టి, ఎడమచేత బాణముల నెక్కువెట్టి ప్రయోగించును. పక్షులు క్రింద పడును]

కర్ణు :—[సంభ్రమాశ్చర్యములతో] పుళిందరాజా! న న్నాశ్చర్య సాగరమున ముంచితివి. కర్ణార్జునులకు దప్ప నిట్టి లక్ష్యభేదన మొరులకు శక్యముగాదు. [అతని భుజముపై చేయివైచి, నిశ్చలముగ చూచుచు] నీవు దక్షిణకరముచే కాక ఇతరమున బాణప్రయోగము సేయుటకు హేతువేమి? పుట్టుకతో వచ్చినదియా నీ కీ వ్యత్యయము?

శబర :—రాజా! కాదు. మొదట నేనును దక్షిణ కరమునే ఉపయోగించుచుంటిని. [అంగుష్ఠరహితమయిన దక్షిణ హస్తమును జూపుచు] కాని ఈర్ష్యాపరుడగు నొక క్షత్రియకుమారుని కారణమున ఈ బొటనవ్రేలిని గోల్పోయితిని. నాటినుండియు ఎడమచేతితో బాణప్రయోగ మభ్యాసము గావించుచు వచ్చితిని.

కర్ణు :—ఏమాశ్చర్యము! విషయమును సవిస్తరముగ విన గోరుచున్నాను.

శబర :—విస్తరించుట కేమున్నది. గురువుగారికి దక్షిణగా నీ యంగుష్ఠ మర్పించితిని.

కర్ణు :—ఏమీ నీ వేకలవ్యుడవా?

శబర :—రాజా! ఔను! మీ రెవ్వరో అడుగవచ్చునా?

కర్ణు :—[సంతోషముతో నేకలవ్యుని గౌగిలించుకొని] ఏకలవ్యా! నేడు నాకు సుదినము. నీవంటి అస్త్రవిద్యావిశారదుని చూడగల్గుట నాభాగ్యము. నీస్నేహమునకు ప్రతిఫలముగా నా యంగరాజ్యమును నీ కర్పించుటకు సంసిద్ధుడనుసుమా!

ఏకలవ్యుడు :—[చేతులు జోడించి] స్వామీ! కర్ణప్రభూ! మిమ్ము తెలిసికొనలేకపోయితిని క్షమింపుడు.

కర్ణు:— సోదరా! నేను అంగదేశమునకు మాత్రమే ప్రభువును. నీవో, అస్త్రవిద్యా ప్రపంచమునకే చక్రవర్తివి.

నేను నిన్ను క్షమించుటయా ? మనఃపూర్వకముగా వచించు చున్నాను. అస్త్రవిద్యలో నీవు నన్ను మించితివి సుమా !

ఏకల:—స్వామీ ! మీ యుదారభావమున కట్లు తోచుచున్నది. ఐనను, ఈ నాసాధనవలన లాభమేమి ? నే నర్జునునితో పోరనినాడు ఈ విద్యవలని ప్రయోజన మెట్టిది ?

కర్ణ:—[కౌతుకముతో] ఏమీ ! అర్జునునితో పోర వలెనని కోరుచున్నావా ? అస్త్రవిద్యా ప్రకటనమే నీ యీ యభిలాషకు కారణమా ?

ఏకల:—ప్రభూ ! కాదు. అతడు కారణముగా నా దక్షిణాంగుష్ఠమును పోగొట్టుకొంటిని. ఐనను దాసికై నేను వగచుటలేదు. గురువునకు ప్రియశిష్యుడై అతడు గ్రహించి సాధించిన విద్య యెంతయో పరీక్షింప గోరెదను. అదియే నా జీవిత లక్ష్యము.

కర్ణ:—[ఆలోచించి - తలపంకించి] ఏకలవ్యా ! అర్జునునితో యుద్ధముచేయు నవకాశము నీకు లభింపవలెనన్న నొక మార్గమున్నది. నీ వందులకు సాహసింతువా ?

ఏకల:—అర్జునునితో ద్వంద్వయుద్ధము లభించుచో నెట్టి సాహసమునకైనను సంసిద్ధుడను. ప్రభూ ! ఆనతి యిండు.

కర్ణ:—జరుగనున్న కురు పాండవ యుద్ధములో కౌరవుల పక్షమున పోరుదువేని నీ యభిలాష నెరవేరగలదు. నీ విష్టపడినచో దుర్యోధన చక్రవర్తియే నిన్నాహ్వానించి గౌరవింపగలడు.

ఏకల:— [సంతోషోత్సాహములతో మొలనుండి బాకు దీసి ముంజేతి పై భాగమును చీల్చి, రక్తసిక్తమగు నా బాకును కర్ణున కిచ్చుచు] మహారాజా! ఇదియే నా ప్రత్యుత్తరము. నా రక్తమును మీకై ధారవోసెదను. గురువుగారి సమక్షమున అర్జునుని నిర్వ్యాపారుని గావించి మిమ్ము సంతస పరచెదను చూడుడు.

కర్ణు:—సోదరా! సంతోషము. రేపే దుర్యోధన చక్రవర్తి నిందు తోడ్తెచ్చి నీతో స్నేహబంధము కల్పింతును. ఎదురుచూచు చుండుము.

ఏకల:—ప్రభూ! వనేచరుడనగు నే నంతటి గౌరవము నకు తగినవాడను కాను. చక్రవర్తిగారి సమయము ననుసరించి నేనే దర్శనమునకు వత్తును లెండు.

కర్ణు:—సోదరా! శూరకులమునకు జెందిన మనకు భేదమెక్కడిది? స్నేహపరుడగు దుర్యోధనుడు నిన్ను తన సోదరులలో నొక్కడుగ చూచుకొనును. సందేహింప వలదు. పార్థుని విజృంభణము నాపగల శూరుడవు నీవు లభించుటచే నేనిప్పుడు నిశ్చింతుడనైతిని. నా సంతసమునకు మేర లేకున్నది. అర్జును నిక రక్షించుకొననీ కృష్ణుడు. [ఏకల వ్యుని చేయిపట్టుకొని నిష్క్రమించును.]

[తెరపడును.]

---

## చతుర్థాంకము

[విదురుని గృహమందలి పూజా మందిరము. ఎదుటి గోడనానుకొనియున్న చలువరాతి వేదికపై పుష్పాలంకృతములైయున్న విగ్రహములు. ఇరువైపుల నెత్తగు దీపస్తంభములు, ఫలములు, పుష్పములు ఇతర పూజాద్రవ్యములు నుండును. కుంతీదేవి స్నాతయై ధౌతవస్త్రములను ధరించి యార్ద్రములగు శిరోజములు భుజములపై వ్యాపించి యుండ విగ్రహముల యెదుట మోకరించి,]

**కుంతి:**—[కొంతవడికి చేతులుమోడ్చి] దయానిధీ! నా మొర యేల యాలింపవు. దుఃఖభాజనమైన యీ జీవితము నింకను నెంతకాలమని యీడ్వగలను. బాల్యముననే నా హృదయమునం దారనిచిచ్చును రగులు కొల్పితివి. అనన్యగతి కనై, చేయునదిలేక, నామనోవేదన నితరులతో చెప్పికొనుటకు గూడ సాధ్యముకాక, నాలో నేనే కుమిలి కుమిలి క్రుంగిపోవుచున్నాను. నా పురాకృత కర్మఫలము శరీరమందలి అంగప్రత్యంగ మావహించి రక్తనాళములంబడి ప్రవహించి, అస్థ్యంతర్గతమై, నెలకొని అనుక్షణమును ప్రాణములను పెకలించి వైచుచున్నది. నన్నింకను నెట్టి శిక్షకు పాల్పరచెదవు, తండ్రీ! ఎంతటి బాధనైన ననుభవించెదను కాని ప్రభూ! నా యీ జీవితమును పుత్రశోకము నుండి రక్షింపుము. నా బిడ్డలను రక్షింపుము. పూజనీయుడగు నన్నను వధించుటకు తమ్ముడును, ప్రేమపాత్రుడగు

తమ్ముని సమయింపనన్నయు నుద్యుక్తులగుచున్నారు. నే నీఘోర పరిస్థితిని చూడజాలను. నా హృదయము దహించుకొని పోవుచున్నది. నా యీ జీర్ణదేహమందలి ప్రతిపరమాణువును జీవితయాత్ర చాలింపవలెనని తహతహ పడుచున్నది. బాల్యమునుండియు నిద్రావస్థయందు కూడ మనశ్శాంతి లేశమే నెరుగని నా యీ దుఃఖభూయిష్ఠమగు జీవితదృశ్యము నీ కేమి యానందము కలిగించుచున్నది. పరమేశ్వరా! ఈ దీనురాలిని కరుణించి యీ లోకమునుండి తప్పింపుము. శాశ్వతమగు శాంతిని ప్రసాదింపుము. [శిరమును భూమిపై మోపి నమస్కరించును. ఇంతలో తలుపుకొట్టిన చప్పుడు వినిపింప కుంతి ద్వారము వంకకు విసుగుతో చూచి] ఎవ్వరు నాధ్యానమునకు భంగము కలిగించునది. [అని పలుకుచు తలుపు తెరచి] ఎవరచ్చట లోనికి రండు.

[ఫలపుష్పములతో నిండియున్న బుట్టతో యుయుత్సుడు ప్రవేశించి, దానిని వేదికసమీపమునం దిడి, కుంతీదేవి పాదములకు నమస్కరించును.]

యుయుత్సుడు:—[లేచి] తల్లీ! నీ యేకాంతమునకు భంగము కలిగించితినా! క్షమింపుము. పూజానంతరము తల్లి చేతి ప్రసాద మాసించి వచ్చితిని.

కుంతి:—నాయనా, యుయుత్సూ! సంతోషము. పదుమూడేడుల నుండియు నేకాకినినై యున్ననాకు ఏకాంతమున కేమి కొదువ? అది యట్లుండనిమ్ము. నీరాక నాకానందదాయక మనుట నీ వెరుగవా తండ్రీ.

యుయు:—తల్లీ; లోకైకవీరులు ధర్మమూర్తులు నగు కుమారులు గల నీ వేకాకిని వెట్లయితివి. దీర్ఘకాల వియోగదుఃఖ మసహ్యమై నీచే నిట్లు పలికించుచున్నది. అమ్మా! ఈ యెడబాటిక నెంతకాలము? అది కాక, నేనును నీ కుమారులలో నొకడనుకానా? నాసేవను గైకొనుటకు నీకు స్వాతంత్ర్యము లేదా?

**కుంతి** :— తండ్రీ! నా కుమారులకంటెను నెక్కుడు శ్రద్ధాభక్తులతో నన్ను నీవు చూచుకొనుచున్నావని నా యంతరాత్మకు తెలియును. కాని, నాకారణమున నీ సోదరు లకు నీవు దూరమగుచున్నావనెడు చింతమాత్రము నా మన స్సును బాధించుచున్నది.

యుయు :— అమ్మా! నా సోదరులకు నే దూరమగు టకు కారణము నీవు కాదు. సత్యధర్మములు కారణములు. ఎన్నడు భారత సతీత్వము రాజ సభామధ్యమున బాహాట ముగ దూషితమయ్యెనో నాడే నేను నా భ్రాతృవర్గమునకు శత్రుడనైతిని. పాండవుల ననుసరించి నాడే యరణ్యములకు పోయి యుండెడివాడను. కాని పుణ్యమూర్తివగు నీవిందు నిలువవలసివచ్చినందున, నీ హృదయ పరితాపమును నాచేత నైనకొలది నుపశమింపజేయు నాశయముతో నేనును నిందు నిలువ నిశ్చయించితిని. యుద్ధారంభమునకు పూర్వమే ధర్మ స్వరూపుడగు యుధిష్ఠిరుని చేరుదునని యిదివరకే సంకల్పించు కొని యున్నాడను. తల్లీ! నేను న్యాయమునకు, ధర్మమునకు దూరమై పోవుచున్నచో నీవు నాకై దుఃఖింపనగును, కాని పాపులను విడుచుచుండగా చింత యెందులకు?

**కుంతి :**—నాయనా! నీ హృదయము నే నెరుగుదును. ఐనను తొందరపడి సాహస మొనర్పకుము. జయాపజయ ములు దైవాధీనములు. నిష్ప్రయోజనముగ నీ తలిదండ్రులకు దుఃఖము కలిగింపకుము.

**యుయు :**—[నవ్వి] తల్లీ! యుద్ధఫల మేనాడో నిశ్చితమైనది. కులవధూశిరోజములు పాపి హస్తస్పృష్టము లైనప్పుడే కౌరవ నాశమైనది. పాపభూయిష్ఠమగు నీ హస్తి నాపుర మింకను భూగర్భమున లీనమైపోవక నిలిచియుండుటకు కారణము నీవంటి పుణ్యామూర్తి యిందుండుటయే. మరియు నేను మనసా ధర్మపక్షమును కోరి చేరుచున్నానే కాని ప్రాపంచిక లాభాపేక్షచే కాదు. [ఇంతలో వీధిలో కల కలము. 'అస్త్రవిద్యా విశారదునకు జయా,' 'పార్థ ప్రతి వీరు నకు జయా'—అని బిగ్గరగా కేకలు కోలాహలము వినబడును. కుంతి చకితయై లేచి కోలాహలము నాలకించుచు నిలబడును. కొంతసేపటిలో నా సందడి క్రమముగా దూరమగును.]

**కుంతి :**—[సంభ్రమముతో యుయుత్సునిజూచి] నాయనా! ఏమా కోలాహలము! ఏదియో విశేషమున్న ట్లున్నది.

**యుయు :**—తల్లీ! చెప్పమరచితిని. పాండవపక్ష వీరులకు ప్రతివీరుల నిర్ణయించుటకై నేడు శస్త్రాస్త్ర ప్రయోగ ప్రదర్శనము జరుపబడినది. అందు కర్ణుడు తోడ్తె చ్చిన శబర నాయకుని ధనుర్విద్యా ప్రదర్శనము పరమాద్భుత కరమై యెల్లర తబ్బిబ్బు కావించినది. అత డర్జున ప్రతి

వీరుడుగా నిశ్చయింపబడినాడు. మేరమీరిన సంతసముచే దుర్యోధనుడా యెరుకరాజును తన రథమున కూర్చుండబెట్టు కొని యుత్సవముతో తన భవనమునకు గొనిపోవుచున్నాడు. ఆ యుత్సవ కలకలమే యిది.

కుంతి :—[నిరసన భావముతో] ఏమీ! పాండవ మధ్యమునకు ప్రతి వీరుడుగా కర్ణుడొక శబరుని నిర్ణయించెనా? భీష్మద్రోణులందున కంగీకరించిరా ?

యుయు :—అమ్మా! మే మెల్లరము ద్రోణునొద్ద నస్త్రశిక్ష బొందుచుండిన కాలమున జరిగిన యేకలవ్య వృత్తాంతము నీకును దెలియును. ఆ యేకలవ్యు డప్పటి నుండియు నర్జును నిగ్రహించు నుద్దేశముతో దక్షిణేతర హస్తమున బాణప్రయోగము సాధించినాడట. ఇప్పు డత డర్జునునితో ద్వంద్వయుద్ధమునకై కాల్ద్రివ్వుచున్నాడు. ఆ యేకలవ్యుడే ఇప్పుడు కర్ణుడుతో డ్తెచ్చిన శబరరాజు.

కుంతి :—కుమారా! ధనుర్విద్య నెంత పట్టుదలతో సాధించినను ఏకలవ్యుడు కర్ణునంతటివాడు కాజాలడుకదా! ఎల్ల విధముల తనతో సాటియగు పార్థునకు నొక యెరుకను ప్రతిద్వంద్విగా నిర్ణయించుట కర్ణునకే యగౌరవమని దోప లేదా ?

యుయు :—తల్లీ! అస్త్రవిద్యయం దర్జునునికంటెను తనకంటెను ఏకలవ్యు డధికుడని కర్ణుని నిశ్చితాభిప్రాయము. కర్ణార్జునులకెందును తీసిపోడని యాచార్యుల 'యభిప్రాయము

కూడ. తాను యుద్ధము చేయకుండుటవలని యనర్థ మిందులచే తొలగుననని కర్ణుడెంతయు సంతసించుచున్నాడు. ఈ విషయము పాండవులకు శీఘ్రమే తెలియుట మంచిదని నా భావము.

కుంతి :—[ఉపేక్షతో] యుయుత్సూ! ఏకలవ్యు డెంతటి ధనుర్విద్యా పారంగతుడైనను దివ్యాస్త్రమంత్రములను, ప్రయోగోప సంహారాదులను తెలియని శబరుడగుటచే నర్జునుని దివ్యాస్త్ర ప్రయోగమునకు ప్రతిక్రియ చేయజాలడు. కావున పార్థు డతని నవలీలగా జయింపగలడు. మనము కలవరము జెంద నవసరము లేదు.

యుయు :—అమ్మా! పొరపడుచున్నావు. ఈ యభిప్రాయమునే పితామహుడు కూడ వెలిబుచ్చెను. కాని కర్ణుడేకలవ్యునకు దివ్యాస్త్ర మంత్రోపదేశము చేయ సంసిద్ధుడై యున్నాడు. తత్ప్రయత్నములును జరుగుచున్నవి. కావున మన ముపేక్షించుటెంతయు నయుక్తము.

కుంతి :—[ఉద్వేగముతో లేచి నిలువబడి] ఆహా! అటులనా! ఏమి కర్ణుని పట్టుదల! అర్జున నిగ్రహము నంత కాంక్షించుచున్నాడా కర్ణుడు! అతనియెడ గల వైరమో లేక స్వామి కార్యతత్పరతయో తెలియరాదు. [ఆలోచించి] కానిమ్ము. ఈ విషయమును కృష్ణునకు తెలుపుటయే శ్రేయము. రమ్ము. విదురునితో సంప్రతించి కర్తవ్యమును నిశ్చయింతము.

[నిష్క్రమింతురు]

[తెరపడును]

## పంచమాంకము

[ఉపప్లావ్యమున అర్జునుని మందిర భాగము. ఉన్నతా సనమున శ్రీ కృష్ణుడును, పార్శ్వమున నర్జునుడును నాసీనులై యుందురు. వివిధములగు నాయుధములు, ధనుస్సులు, గోడల కమర్పబడియుండును. కృష్ణుని యెదుట నొక యెత్తగు ముక్కాలిపీటపై తాంబూలపు పళ్లెరముండును.]

కృష్ణుడు :—అర్జునా! ఏమింతటి ప్రమత్తత! మీ మేనమామయగు శల్యుడు దుర్యోధన పక్షము చేరునట్లొన ర్చుటయా! స్వయముగ బోయి యాహ్వానించుటకు మీ కెవ్వరికిని తీరిక లేకపోయెనా?

అర్జునుడు :—కృష్ణా! మోసము జరిగినది. శల్యుడు స్వసైన్యముతో మమ్ము జేరవచ్చుచు మార్గమధ్యమున దుర్యోధనునిచే వంచితుడైనాడు. స్వయముగ మేమెవ్వర మును పోకుండుట మా పొరపాటు. అన్నగారును ఉపేక్ష వహించినారు.

కృష్ణు :—మీ యన్నగారి ఉపేక్ష కేమిలే. ఆయన ధర్మరాజు. సేను శత్రుపక్షమున జేరినను నతడు దైవముపై భారమునైచి నిశ్చింతుడై యుండగలడు.

అర్జు :—ఇది అన్నగారి విశిష్టగుణము కృష్ణా! ఎల్లె నను ధర్మము జయించునని యతని మతము. కాని, లోక మున న్యాయధర్మముల ప్రవృత్తి దీనికి భిన్నమై కన్పట్టు చున్నది. బాల్య మాదిగ న్యాయమార్గ ప్రవర్తకులమై స్వధ

ర్మము పాలించుచు జీవించుచున్న మాకు లభించిన విశిష్ట సౌఖ్యమెద్ది ? అధర్మవర్తనులగు కౌరవులకు గలిగిన లోటెద్ది ?

కృష్ణ :—పార్థ ! పామరునివలె మాటాడకుము. ఇహసౌఖ్య లాభములవలననా మనము న్యాయధర్మముల నిర్ణయమొనర్ప వలసినది ? ధర్మము లోకాతీతమైనది. దాని ఫలమును జీవితాతీతమైనదియే. న్యాయ్యపథము నవలంబించి మీరుసలిపిన యరణ్యాజ్ఞాతవాస సమయపాలనము ప్రమోద దాయకమైనదియో లేక వంచనచే దుర్యోధనుడు గడించిన సామ్రాజ్యము సౌఖ్యదాయకమైనదియో విజనస్థలమున గూర్చుండి ప్రసన్నమనస్కుడవై ఆలోచించి చూడుము. నీప్రశ్నకు సదుత్తరము లభింపగలదు. కౌరవులానందము ననుభవించుచున్నారని నీవు భ్రమపడుచున్నావు. ఈ పన్ను మూడేడులనుండియు ధృతరాష్ట్ర దుర్యోధనాదులు మానసికముగా ననుభవించుచున్న వ్యథను నీ వెరుంగవు. నియమమును సక్రమముగ నడపి మీరెప్పుడు వత్తురో, యెప్పుడు మీశపథములను నెరవేర్తురో యను భీతిచే వారొక్కక్షణమైనను మనశ్శాంతి నెరుగరు. మీ రనుభవించుచున్న మనశ్శాంతి వారేనాడును నెరుంగరు. అనవరత మానసికాందోళనతో గూడిన అశాంతిజీవితము వారిది. మీకున్న ప్రసన్నత; శాంతిస్థైర్యములు వారికి లేవు. సత్యపాలనమువలన మీకు లభించిన ఫలమెట్టిదో గ్రహించితివా ?

అర్జు :—కృష్ణా ! నిజమే. మనశ్శాంతి లభించినదని అంగీకరింతును. ధర్మావలంబనమువలన నిహలోక సౌఖ్యములు లభింపకున్న మానెకాక. కాని ఏపాపపుణ్యముల నెరుగని సాధ్వి ద్రౌపది తలపగూడని దౌష్ట్యమునకు గురియగుటయు, పడరాని యిడుమలు బడుటయు ధర్మైక జీవితఫలమేనా ? పుత్రవియోగము ననుభవించుచు కుంతి పట్టెడుకూటికై పరుల నాశ్రయించి దుఃఖజీవితము గడపుచుండుట యేల ?

కృష్ణ :—పార్థా ! ప్రకృతితత్త్వమది. సతియను మాతయను మమతకు లోనుగాక యీ సమస్యనుగూర్చి చర్చించుచో జీవితరహస్యము సుబోధము కాగలదు. తలిదండ్రు లొనర్చిన తప్పిదముల కారణమున నేపాపము నెరుగని కసుగందులు బాధజెందుట మనము లోకమున చూడమా ? తల్లి భుజించిన అపథ్యాహార కారణమున శిశువు బాధజెందుట యేమి న్యాయము. ధర్మపరులని మీపక్ష మవలంబించిన యీ యేడక్షౌహిణుల సైన్యము యుద్ధాంతమునను జీవించియుండునని యే నీవు తలంచుచున్నావా ? నీబంధువులు, హితులు, ప్రేమైక పాత్రులు, ఎందరీధర్మ సంగ్రామమున నశింతురో నీకు తెలియునా ? మమతాగంధ వర్జితులమై పరిశీలించిననే తప్ప మనకు జీవితతత్త్వము బోధపడదు. జీవుల జన్మజన్మాంతర కృతముపై నంతయు నాధారపడి యుండును. అధర్మమూ బలీయమనెడి భ్రాంతిని వీడుము.

అర్జు :—కృష్ణా ! నీతో వాదించుటకు దగినపాండితీ జ్ఞానములు నాకు లేవు. కాని, యొక ప్రబలసందేహము నన్ను

పీడించుచున్నది. మానవుని సుఖదుఃఖములు ధర్మాధర్మ ప్రవర్తనపై నాధారపడకున్నచో నిక జీవితప్రవృత్తి కాధార మేది? ధర్మమార్గవర్తను డగుటకు మానవు డేల ప్రయత్నింప వలెను.

కృష్ణు:—అర్జునా! ధర్మతత్త్వ మతి సూక్ష్మమైనది. అది యిట్టిదని నిర్ణయించుటకు మానవమాత్రులకు సాధ్యము కాదు. ఏది ధర్మమో, ఏది యధర్మమో నిర్ణయించుటయు కష్టమే. లోకాతీతమైన ధర్మరక్షణార్థ మెందరో నిర్దోషు లోకప్పుడు నశింపవలసి యుండును. లోకమే రక్తసిక్తము కావలసివచ్చును. సకల సన్నాహములు, సర్వప్రయత్నములు మానవుడొనర్చినను దైవబలములేక ధర్మమునకు హాని కలుగవచ్చును. దైవబల ముండియు పురుషప్రయత్నము చాలని కారణముచే ధర్మము ఫలింపక పోవచ్చును. జడ ప్రకృతియు మనోదార్బల్యమును, ధర్మనాశమునకు ప్రధాన హేతువులు. నిరంతరప్రయత్నముచే, నకుంఠితమగు చైతన్య ముచే, నక్షయమగు నాంతరశక్తిచే, మమతారహితమగు మనోనిగ్రహముచే, నిరహంకారముతోగూడిన నిష్కామ కర్మచే ధర్మము రక్షిత మగును.

[ఇంతలో ద్రౌపది పాయసముచే నిండిన హేమపాత్ర ముతో ప్రవేశించి దానిని కృష్ణుని ముందిడి]

ద్రౌపది:— అన్నా! స్వగృహమునకును, క్షత్రియో చితమగు జీవనమునకును దూరులమై విరటుని యౌదార్యముపై బ్రతుకుచున్న మేము నిన్నుచితరీతిని సత్కరింప లేకున్నాము.

పరుల ద్రవ్యమేమైనను స్వహస్తములచే వండినది కావున నీ పాయస మారగింపుమని వేడుకొనుచున్నాను.

కృష్ణ:—[చిరునవ్వుతో - పాయసమును రుచి చూచుచు] చెల్లెలా! అరణ్యమునందున్నను నీవు వీరపత్నివి సుమా! శీఘ్రమే స్వారాజ్యమును మరల గాంచి ధర్మమునకే యాతిథ్య మొసంగగలవు. ఈత్రయోదశ వత్సరములును నర్జునుడు కావించిన ప్రయత్నమంతయు నంపుల కే కదా!

ద్రౌపది:—కృష్ణా! మా ప్రయత్నము కాదది. నీ ప్రోద్బలము. విరటునింట బాధ్యతారహితమగు జీవనమున కలవాటుపడిన కారణమున మాక్షత్రియ తేజము సన్నగిల్లినది; శక్తి సామర్థ్యములు బెండువారినవి. జపహోమాది వైదిక కర్మలయందును, నృత్యగీతాది లలితకళలందును, మా కభిరుచి మెండైనది. కావుననే కదా, ఐదగ్రహారములయాచ్ఛార్థమై మొన్న నీవు కురుసార్వభౌముని నగరమున కరుగుట. [చిరునవ్వుతో అర్జునుని జూచును.]

అర్జు:—[నవ్వుచు] బావా! అగ్నికుండమున నుద్భవించిన దగుట నీ చెల్లెలు విస్ఫులింగ స్వరూపము సుమా!

కృష్ణ:—అది యుచితమే. పురుషుని గౌరవాభిమానములను రక్షింపవలసినది సతియేకదా! పంచగ్రామ సంధి విషయమై నీతల్లియు నాతో వైముఖ్యమును సువ్యక్త మొనర్చినది.

[కంచుకి ప్రవేశము]

**కంచుకి:**—దేవా! హస్తినాపురమునుండి గూఢ చారుడు వచ్చి ద్వారమున వేచియున్నాడు. ఏకాంతమున మీతో విన్నవింపవలసిన అంశములు కలవట.

**అర్జు:**—కృష్ణా! మాకిక ననుజ్ఞ యిమ్ము. సుభద్ర యింటికి మధ్యాహ్న భోజనమునకు రావలసినదని మా ప్రార్థన. మీ చెల్లెలు వింకొనర్పదలచియున్నది.

[ద్రౌపదితో నిష్క్రమించును]

[జాంగలుడను గూఢచారుడు ప్రవేశించి కృష్ణునకు వినయముతో నమస్కరించి నిలుచును]

**కృష్ణు:**—జాంగలా! ఇంత త్వరలో వచ్చితివి. వింత లేమైన గలవా?

**జాంగలుడు:**—దేవా! విషయమును విన్నవించుకొందును. భీష్ముని మాటపై కోపించి కర్ణు డస్త్రపరిత్యాగము కావించుట మీరును వినియుందురు. అర్జును నిక నడ్డుకొను వారు లేరని ఖిన్నుడై యున్న కర్ణు డిప్పుడు అర్జునుని విజృంభణము నాపుటకును, నతనిని నిగ్రహించుటకును నొక మహావీరుని తోడ్తెచ్చియున్నాడు.

**కృష్ణు:**— ఏమీ! అర్జును నాపగల మహావీరుడొక డుద్భవించెనా? ఎవ్వడా వీరుడు? సమగ్రముగా నెరిగి వచ్చితివా?

**జాంగ:**—దేవా! అర్జునాదుల బాల్యమున జరిగిన యేకలవ్యవృత్తాంతము మీ రెరిగినదియే. ఆ యేకలవ్యుడే యీవీరుడు. ఆ విషయమై అమ్మగారు కుంతీదేవిగారు సవివరణ మగు నీజాబును మీకు పంపియున్నారు. చిత్తగింపుడు. [జాబు నిచ్చును.]

**కృష్ణు:**—[లేఖను నిదానముగ జదివి ముహూర్త కాల మాలోచనా నిమగ్నుడై యుండి – తలపంకించి] ఆహా! ధర్మపథమునం దీ యేకలవ్య ప్రతిబంధ మొకటి కల్గెనా? ఊ...జాంగలా! కౌరవుల స్థితి యెట్లున్నది?

**జాంగ:**—ప్రభూ! శత్రుపక్ష సైన్యమంతయు నత్యుత్సాహముతో చెలరేగియున్నది. శస్త్రము పట్టనని ప్రతిజ్ఞ యొనర్చిన మీ రెట్లు అర్జునుని రక్షింతురో "చూచెదము"ని కౌరవులెంతయు విజృంభించియున్నారు.

**కృష్ణు:**—ఆహా! అటులనా! [స్వగతము] ఎట్లు రక్షించెదనో చూచెదరుగాక. [ప్రకాశము] సరియే! జాంగలా! సారథియగు ధారుకు నిట బంపుము. [ఇటునటు పచారు చేయుచుండును.—జాంగలుడు నిష్క్రమించును.]

[తెరపడును]

# షష్ఠాంకము

[అరణ్య మధ్యప్రదేశము – ధనుర్ధరుడగు శ్రీకృష్ణుడు దారుకునితో ప్రవేశించును.]

కృష్ణు :—దారుకా ! మన వేగులవాండ్రు నిర్దేశించిన ప్రదేశమియ్యదియేనా ? పొరపాటు జరుగలేదుకదా !

దారుకుడు :—సందేహింప పనిలేదు ప్రభూ ! కర్ణ దుర్యోధనులిందు వచ్చుటయు, శబరరాజుతో మంతనము లాడి పోవుటయు నేనును స్వయముగా వేగులవాండ్రతో వచ్చి చూచియున్నాను. [చుట్టును పరికించి చేతితో చూపుచు] స్వామీ ! అదిగో ! పెంపుడు జింకకు మేతపెట్టుచు చెరువు నొద్ద నుండి వచ్చుచున్న యతడే యా కిరాతరాజు.

కృష్ణు :—[నిదానించి చూచి–తలపంకించి] దారుకా! నీవిక నిచ్చటనుండి పొమ్ము. అడవి వెలుపల హస్తినాపుర మార్గమున రథముతో వేచియుండుము. నేనితనితో కార్య మును తేల్చుకొని నిన్ను కలసి కొందున్లు పొమ్ము.

దారు :—చిత్తము. [నమస్కరించి వెడలిపోవును]

[కృష్ణుడు సవిలాసముగ నొక చెట్టు నానుకొని యీల వైచుచు నిలబడి యుండును. పరధ్యానముగ బ్రవేశించిన యేకలవ్యుడు కృష్ణుని యీల విని చకితుడై నిశ్చలముగ నతని జూచి, సమీపించి]

**ఏకలవ్యుడు:**—అయ్యా! వేషమును బట్టి చూడ మీరు క్షత్రియులవలె గన్పట్టుచున్నారు. ఈ యరణ్యమును చూచు నభిలాషతో వినోదార్థమై వచ్చితి రనుకొందును. ఐనచో మీకు స్వాగతము.

కృష్ణుః—శబరరాజా! ఔను, నీ వూహించినట్లు నేను క్షత్రియుడనే. వన్యమృగము లిందు బహుళముగ నుండునని విని మృగయాసక్తుడనై వచ్చితిని.

ఏకల:—రాజా! వేట మీ ప్రయోజనమైనచో నది యిందు ఫలింపదు. శార్దూలాది క్రూరమృగము లెవ్వియు నీ యరణ్యమున లేవు. కనుక మీరు మరలి పోవచ్చును.

కృష్ణుః—శబరనాయకా! హరిణసమూహ మదిగో విరివిగా కన్పడు చున్నది. అంతరిక్షమున కెగురుచు పరుగిడు నిట్టిని గొట్టుటయందు ధన్వి కౌశలము ప్రదర్శితమగును కాని, శార్దూలమును గొట్టుటలో నైపుణ్యమే మున్నది.

ఏకల:—[తీవ్రస్వరమున] రాజా! క్రౌర్యమే క్షత్రియకులోచితమగు ప్రవృత్తి కావచ్చును. కాని ప్రతిక్రియ చేయజాలని శాంతస్వరూపములైన ఈ జింకలను వేటాడుటకు మీ కవకాశము లేదు. నిస్సహాయముల్లగు వీనికి నేను రక్షకుడను.

కృష్ణుః—[నవ్వుచు] ఏమీ! ప్రపంచమందలి నిస్సహాయములగు ప్రాణుల కన్నిటికిని నీవు రక్షకుడవా!

ఏకల :—ప్రపంచమునకు రక్షకుడు భగవంతుడు.. నిస్సహాయులగువారి నెల్లర రక్షించుట అతని కర్తవ్యము. ఆ మహాకర్తవ్యము నెరవేరుటలో నేను నొక యుపకరణమని తలంచుచున్నాను. ఈ యరణ్యామందలి జింకలకు హానికలుగకుండ రక్షించుట నా ధర్మమని నా నమ్మకము.

కృష్ణు :—వీరుడా ! ధర్మాధర్మ విచారణకు దిగకుము. జింకలపై నీకుగల మమకారకారణమున వీనిని నీవు రక్షించుచుంటివే కాని దుర్బలములు సాధుస్వభావములు నైనవి అవశ్యరక్షణీయము లనెడి ధర్మబుద్ధితో కాదు. ఒకచో నధర్మమునకు, నన్యాయమునకు మనఃపూర్వకముగ చేయూత నిచ్చుచు వేరొకచో ధర్మోపన్యాస మెందులకు ?

ఏకల :—[క్రుద్ధుడై] ఏమీ ! నే నధర్మము చేయుచుంటినా ? నాజీవితమున నే జేసిన యధర్మకార్య మేదియో పేర్కొనుము.

కృష్ణు :—పులిందరాజా ! నిజము బల్కిన కోపమెందులకు ? అధర్మతత్పరులు, ఉన్మార్గవర్తనులు నగు కౌరవుల పక్షము నవలంబించి, ధర్మమూర్తులగు పాండవులను హింసింప దలచు నీవెట్టి ధర్మరక్షకుడవు. [నవ్వును]

ఏకల :—[కొంతసేపు నిరుత్తరుడై యుండి] రాజా ! కౌరవులపక్ష మన్యాయమైనది కావచ్చును. కాని నేను వారి గెలుపు నాశించి పోరుటలేదు. అర్జునుని నిగ్రహించుటయే నా యాశయము.

కృష్ణ :—అర్జునుని నిగ్రహమువలన పాండవుల కప జయమును కౌరవులకు విజయమును సిద్ధించును. అట్లు జరుగుచో ధర్మహాని కాదా ? దానికి నీవు కారకుడ వగుదువు కదా ? అర్జునుని మించిన మేటివిలుకాడవనెడి కీర్తిని లోకమున ప్రకటింపగోరి ధర్మమును బాధించుచున్నావు. తెలిసికొనుము.

[ఏకలవ్యుడు నిరుత్తరుడై కృష్ణుని ముఖము చూచుచు నిలబడును]

కృష్ణ :—ఏకలవ్యా ! నా మాటలయందలి సత్యమును గ్రహించినట్లు కన్పడుచున్నావు. ఇప్పుడింకను మించిపోయినది లేదు. అధర్మవర్తనుల పక్షమును త్యజించి పాండవుల పక్షము నూనుము. అది యిష్టముకానిచో నుదాసీనుడవై యుండుము. బుద్ధిపూర్వకముగ నధర్మమున కేల చేయూతనొసంగెదవు ?

ఏకల :—[తొందరగ] రాజా ! ధర్మమో ? అధర్మమో! తెలియక మాట యిచ్చితిని. ఇప్పుడు తెలిసి మాట తప్పుటయా? అది యెన్నటికిని జరుగదు. అది యట్లుండనిండు. ఈవిషయమున శ్రద్ధవహించుచున్నారు. మీరెవ్వరో యడుగవచ్చునా ?

కృష్ణ :—పుళిందరాజా ! ధర్మప్రస్తావన జేసితివి కాన పలుకవలసి వచ్చినది. పార్థరక్షణకు బద్ధకంకణుడై కృష్ణుడుండగా నీవర్జునుని జయించుట కల్ల. అధర్మపక్ష మవలంబించితి

వనెడి దుష్కీర్తి మాత్రము నీకు తప్పదు. బాగుగ నాలో
చించి చూడుము.

ఏకల :—భీష్మద్రోణులకు కలిగెడు దుష్కీర్తియే
నాకును కలుగగలదు. పొరపాటున చేసిన తప్పును సవరించు
కొనుటకై బుద్ధిపూర్వకముగ మాట తప్పజాలను. మరియు
ఆయుధము పట్టనని ప్రతిజ్ఞ చేసిన కృష్ణుడు అర్జునుని రక్షించుట
ధ్రువమని చెప్పజాలము కదా ?

కృష్ణ :—పిచ్చివాడా! భీష్మద్రోణాదులనుండి పాండ
వులను రక్షింపగల కృష్ణుడు నీనుండి యర్జునుని కాపాడలేడా?
యుద్ధారంభమునకు పూర్వమే నిన్ను కృష్ణుడు వధింపకూడదా?
అప్పుడు నీయాశయ మేమగును.

ఏకల :—నిష్కారణముగ కృష్ణుడట్టి యకార్యమున
కేల పూనును ? ఏ కీడును జేయని నాతో నతనికి శత్రుత్వ
మెందులకు ?

కృష్ణ :—నీకు రక్షణీయములైన జింకలను వేటాడ
బూనిన నేను నీకెట్లు శత్రుడనైతినో యట్లే తనకు రక్షణీయు
లగు పాండవులను హింసింపబూనిన నీవును కృష్ణునకు వధ్యు
డవే. అట్టిచో కృష్ణుడు నిన్నేల వధింపగూడదు.

ఏకల :—కానిండు ! నా కతడు శత్రువే కావచ్చును.
కృష్ణుడు నన్ను యుద్ధమున వధించిన వధించునుగాక సంతో
షమే. వీరమరణమునకు శూరుడైన వాడెవ్వడును భయ
పడడు.

కృష్ణుడు :—అహ్హాహా! [నవ్వి] కృష్ణుడు నీతో యుద్ధము చేయుటయా? పిచ్చివాడా! నీతో యుద్ధమొనర్చియే నిన్ను చంపవలెననెడి బాధ్యత కృష్ణునిపై గలదా? నీ జింకలను హింసించు సింహశార్దూలాది ఘాతుకమృగముల నన్నింటిని నీవు యుద్ధమునందే చంపితివా? ప్రకృతిసిద్ధముగా తమ కాహారములై యున్న హరిణములను భక్షించిన శార్దూలాదులు నీకవశ్యము వధ్యములై నవికదా? చెట్లనీడలలో హాయిగ సుఖనిద్రయందున్న పులులను, పిల్లలకు పాలిచ్చుచు కనుగూర్కియున్న యాడుసింహములను, నిర్భీతిగ పొదలలో చెరలాటమాడుచుండిన పులిపిల్లలను, ఎన్నిటిని నీ క్రూరబాణముల కాహుతి చేయలేదు నీవు. జింకలయందు నీకుగల మమకారమే ఈ నీ క్రౌర్యమునకు మూలముకాదా? ఇదియంతయు ధర్మయుద్ధమనియే నీయభిప్రాయమా?

ఏకల :—రాజా! ఇతరులకు హాని యొనర్చు ఘాతుక మృగములవి. మానవధర్మములు వానియెడ వర్తింపవుకదా?

కృష్ణ :— శబరాధిపా! జన్మతోడనే మానవత్వము కలుగుననుకొనుచున్నావు కాబోలు. మానవత్వ పశుత్వములు గుణశీలములపై, ప్రవర్తనపై నాధారపడియున్నవియే కాని బాహ్యరూపముపై కాదు. కంస జరాసంధాదులు మానవులనియే నీ భావమా? సాధ్వీమణియగు కులకాంతను సభామధ్యమున కీడ్చి చీరలొలిచినవారు ఘాతుకమృగముల కంటెను నధములుకారా? అట్టి నరరూపరాక్షసులకు హితు

లైన నీవంటివారలను రాక్షసులే కాన అవశ్యము హంతవ్యులే కదా!

ఏకల:—రాజా! నీతో నేను వాదింపజాలను. కృష్ణుడు నన్ను చంపినను సంతోషమే. అర్జునుని రక్షించుటకై కృష్ణుడేకలవ్యుని చంపెననుట నాకు కీర్తికాదా? నేను మాత్రము మాట తప్పజాలను. కానిమ్ము.

కృష్ణ :—కానిమ్ము. అట్టి కీర్తిమాత్రము నీకు తప్పదు. [అని హఠాత్తుగా మొలనుండి బాకుదీసి ఒక్కసారిగా ఏకలవ్యుని గుండెలలోనికి బొడుచును].

ఏకల :—హా! మోసము. [అని క్రింద పడుచుండ కృష్ణుడతనిని తనచేతులతో పట్టుకొని అంకమున నిడుకొని కూర్చుండును.]

కృష్ణ :—[ఏకలవ్యుని తలపై చేయిడి] ఏకలవ్యా! శాంతింపుము. నేనెవ్వరో చూడుము. [ఏకలవ్యుని కన్నులపై చేతితో తుడుచును]

ఏకల :—[తలను కొంచెము పైకెత్తి, కృష్ణుని ముఖము చూచి, చేతులతో కన్నులుమూసికొనుచు, తల వెనుకకు వాల్చి] దేవా! నీకన్నులలోని వెలుగును చూడనోపకున్నాను. నా కన్నులు మూసికొని పోవుచున్నవి.

కృష్ణ:—ప్రకృతికుమారా! నేను కృష్ణుడను సుమా? నీ శస్త్రకౌశలమును లోకమెఱుగకున్నను నీ వర్జునునకంటెను

నధికుడవని నే నెరుగుదును. కనుక అర్జునుని కాపాడి ధర్మ మును రక్షించుటకై నిన్ను చంపక తప్పినదికాదు. అంతరి క్షమునందు దివ్యవిమానారూఢుడవై నిలిచి, జరుగనున్న ధర్మ సంగ్రామమును త్వరలో వీక్షింపగలవు. పితరులు, పితామ హులు, సోదరులు, బంధువులు, హితులు, శిష్యులు ననెడి యభిమానమును వీడి యెట్లీ యుభయపక్షములవారును నొకరి నొకరు హింసించుకొందురో, ఎందరీ ధర్మసంగ్రామమున నశిం తురో చూచెదవు. ధర్మరక్షణమే ఫలముగాగల యీ భారత సంగ్రామ యజ్ఞమున నీవు ప్రథమాహుతివైతివి. రాగద్వేష మోహావేశ వివశులై రణరంగమునం దన్యోన్య హననమున నశింపబోవు కౌరవ పాండవ వీరులకు లభింపనట్టి శాశ్వతమగు పదవి నీకు లభింపగలదు. అభిమాన మాత్సర్యములను వీడి, భగవత్స్వరూపమగు ప్రకృతిలో లీనుడవగుము. నీకు పునర్జన్మ లేకుండుగాక.

ఏకల: — దేవా! నేను దుఃఖింపను. అధర్మ పక్షమునపోరుట తప్పెననియు, నీ చేతులలో ప్రాణములు విడుచుచుంటిననియు సంతసించుచున్నాను. ఐనను, ఒకమనవి. నన్నే జీవితముగా చూచుకొనుచున్న నాతల్లి వార్ధక్యమున మంచముపట్టియున్నది. ఏసమయమున జీవయాత్ర చాలిం చునో తెలియదు. అంత్యకాలమున పుత్రశోకముతో నెంత పరితపించునో యని మాత్రమే చింతించుచున్నాను.

కృష్ణ :—[క్షణము నిమీలితనేత్రుడై యుండి] కుమారా! ఆమె కవసానకాలము సమీపించినది. నిన్నుగా

చూచుకొని ఆమె నాచేతులలో నిర్యాణముచెంది ఈభవ బంధములనుండి విముక్తిని పడయగలదు. పుత్రశోకము నామె యనుభవింపదు. శాంతింపుము. [ఏకలవ్యుని కన్నులను చేతితో మూయును.]

ఏకల :—ప్రభూ! సెలవు. [చైతన్యరహితుడగును.]

కృష్ణ :—[ఏకలవ్యుని దేహమును భూమిపైనిడి ఉత్తరీయముచే కప్పి, కొంతసేపూరక నిలువబడి] యజ్ఞమారంభమైనది. ఉభయపక్షముల జేరిన అష్టాదశాక్షౌహిణీ సైన్యము యజ్ఞకుండమున ప్రవేశించుటకై ముందునకు దూకుచున్నది. లోభులు, మదాంధులు, అధర్మావలంబులు నగు కౌరవులు,—అహంకార మమకారములకు లోనై అజ్ఞానులై యున్న యభిమన్యు కుమారాదులు - ధర్మభీరువులై పారతంత్ర్యమునకు దాసులై యున్న భీష్మద్రోణాదులు, - ఎల్లరును అధర్మపరిణామ ఫలమగు నీ సంగ్రామాగ్నిలోబడి నశింపవలసిన శలభములే. అహంభావ రోగపీడితులై, గర్వాంధులై, న్యాయాన్యాయ, ధర్మాధర్మ వివేచన శూన్యులై, అల్పములు, అనిత్యములునగు ప్రాపంచిక విషయములకు దాసులై ప్రవర్తించు స్వార్థపరులతో నిండియున్న ఈ సంఘమునందు ధర్మమునకును, సత్యమునకును నిలువనీడ లేకుండనున్నది. సైనికాశ్వహస్తి కంకాళములచే నిండి బీభత్సమై, అంగప్రత్యంగ వికలులై సగము చచ్చిపడియున్న సైనికులయార్త నాదములచే హృదయవిదారకమై, మాంసమస్తిష్కపంకము నావరించి తిరుగాడు గృధ్ర సృగాలాదులచే భయంకరమై,

రణరంగము లోకభీషణమై పరిణమించిననే తప్ప జ్ఞానబోధ కవకాశము కలుగదు. ఇంద్రియ ప్రాబల్యమునకు వశులై రాగాంధులై యున్న వీరి రక్తము నదీరూపమున ప్రవహించి సప్తహ్రదరూపమున నీ కురుక్షేత్రమున శాశ్వతముగ నిలిచి భావిమానవజాతికి జ్ఞానబోధ గావింపవలసియున్నది. [ఏకలవ్యుని దేహమును జూచుచు] ప్రథమయజ్ఞపశువు శాంతముగ నాహుతియైనది. [నవ్వి] అంత్య నిమేషమునందును — తల్లియని పుత్రుడని మమత. సుభద్ర! అభిమన్యుడు! ప్రద్యుమ్నుడు! సాత్యకి! కృష్ణుడు! అహ్హాహ్హాః! [వికటముగ నవ్వి] ధర్మరక్షణకు, ధర్మస్థాపనకు శంకుస్థాపన గావించితిని. జయప్రదముగ జరుగనీ యజ్ఞము. [అట్టహాసమొనర్చుచు నిష్క్రమించును].

[తెర పడును]

---